# వాహినీవారి

# మల్లీశ్వరి

# నేడే చూడండి

| | | | |
|---|---|---|---|
| విజయవాడ | సరస్వతీ పిక్చర్ పాలెస్ | నెల్లూరు | శేష్‌మహల్ |
| తెనాలి | రత్నా టాకీస్ | గుంటూరు | సరస్వతీ పిక్చర్ పాలెస్ |
| మచిలీపట్నం | మినర్వా టాకీస్ | ఏలూరు | పాండురంగ టాకీస్ |
| రాజమహేంద్రవరం | అశోక మహల్ | కాకినాడ | క్రౌన్ టాకీస్ |
| విశాఖపట్నం | సరస్వతీ పిక్చర్ పాలెస్ | విజయనగరం | శ్రీ కృష్ణా సినిమా |
| గుడివాడ | శ్రీనివాస సినిమా | భీమవరం | మారుతీ టాకీస్ |
| అనంతపురం | రఘువీర్ టాకీస్ | బళ్లారి | ప్రభాత్ టాకీస్ |
| కర్నూలు | చాంద్ టాకీస్ | హైదరాబాదు | సాగర్ & రహత్‌మహల్ |
| సికింద్రాబాదు | రాజేశ్వరి టాకీస్ | వరంగల్ | ప్రభాకర్ టాకీస్ |
| సూర్యాపేట | జై హింద్ టాకీస్ | ఖమ్మంమెట్టు | సుందర్ టాకీస్ |
| షోలాపురం | సరోజ్ టాకీస్ | గడగ్ | చిత్రా టాకీస్ |

**27-12-51** నుండి తాడేపల్లిగూడెం - శ్రీ కృష్ణ బాలాజీ టాకీసులో
శ్రీకాకుళం, బొబ్బిలి, తణుకు, రామచంద్రపురం, చీరాల, ఒంగోలు, అదవాని,
నంద్యాల, హొసపేట, కడపలలో అతిత్వరలో విడుదల.



# విషయానుక్రమణిక

## 1951 డిసెంబరు 26



12 ఎంట్రీలుపైన పంపే ప్రతీవారికీ స్పెషల్ బహుమతి కలదు.

ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder K. NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 17
26-12-51

ఖర సంవత్సర మార్గశీర్ష బహుళ త్రయోదశి బుధవారము

# దేశీయసమస్యలు; పార్టీలు 1

మద్రాసు రాష్ట్రంలో ఎన్నికలు జనవరి 2 వ తేదీనుంచి ప్రారంభం కానున్నాయి ఈ సమయంలో ప్రభుత్వ నిర్మాణానికి మూలకారకులైన వోటర్లు, శాసనసభ్యులు కానున్న వివిధపార్టీల అభ్యర్థులు గమనించవలసిన ముఖ్యాంశాలు కొన్ని ఉన్నాయి ప్రజాస్వామ్యంవల్లనే దేశం అభ్యుదయపథాన అనుగమించగలదనే విశ్వాసంతో తదనుగుణమైన రాజ్యాంగాన్ని నెలకొల్పాం ప్రజల శాంతి సుఖజీవనానికీ, జాతీయ వికాసానికీ ఇదే సుగమమైన పథమని ప్రజల ప్రతినిధులు నిర్ణయించారు సర్వజన శ్రేయస్కరమైన సమష్టిజీవనాన్నీ, వ్యక్తిగత వికాసానికి అవసరమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సమానావకాశాలనూ సమన్వయపరచగలిగేది ప్రజాస్వామ్యవిధానమేనని భారతదేశం విశ్వసించింది

ఇప్పుడా రాజ్యాంగాన్ని సర్వవర్గాలవారికీ ప్రయోజనకారి కాగలవిధంగా అములుజరపవలసిన బాధ్యత వోటర్లపైనా, అన్ని పార్టీలవారిపైనా ఉంది ఈనాడు దేశంలో పరిష్కరించబడవలసిన సమస్యలేవి, ఆ సమస్యలను పరిష్కరించగల ఉత్తమమార్గమేది, ఏ పార్టీలకు ప్రభుత్వాధికారమిస్తే ఆ సమస్యలను సక్రమంగా పరిష్కరించగలవు అనే అంశాలను వోటర్లు పరిశీలించి, ఆ ప్రకారం తమ వోట్లను ఆ పార్టీలకివ్వాలి దేశీయ సమస్యలను గురించీ, ఆ సమస్యల పరిష్కార విధానాలను గురించీ ఎన్నికల సమయంలో ఆయా పార్టీలు తమ తమ దృక్పథాలను నివేదికలద్వారానూ ప్రచారం ద్వారానూ విశదంగా బోధపరుస్తాయి

నేటి దేశీయసమస్యలను స్థూలంగా ఇలా వివరించవచ్చును నిత్యజీవనావసరమైనవస్తు సామగ్రిని అందరికీ సరిపోయేటంత ఉత్పత్తి చెయ్యాలి అందరికీ అందుబాటులో ఉండేలా వస్తువుల ధరలను తగ్గించాలి దారిద్ర్యాన్ని, నిరుద్యోగాన్ని నివృత్తి చెయ్యాలి దేశంలో ప్రశాంత పరిస్థితులను నెలకొల్పి అందరూ నిర్భయంగా స్వేచ్ఛగా తమ తమ వృత్తులను అనుసరించడానికి తగిన పరిస్థితి ఏర్పడాలి అవినీతినీ, లంచగొండితనాన్నీ, బ్లాక్‌మార్కెటింగ్‌నీ అరికట్టాలి ప్రభుత్వం తలపెట్టే కార్యక్రమాల నిర్వహణలోనూ, పరిపాలనా నిర్వహణలోనూ ప్రజలు ప్రభుత్వంతో సహకరించగల పరిస్థితి ఏర్పడాలి ఈ కర్తవ్యాలేవైనా కొనసాగాలంటే స్థిరమైన, బలమైన ప్రభుత్వాలు నెలకొనాలి ప్రజలలో విద్యావ్యాప్తి, ఆరోగ్యవృద్ధి వీనికి అనుబంధాలు

ఈ సమస్యలను పరిష్కరించడానికి ఏ పార్టీ సూచించే పరిపాలనావిధానం, కార్యక్రమాలు అనుకూలమైనవో, ఏ పార్టీకి తగినబలం, బలగం, సమర్థులైన నాయకులూ ఉన్నారో వోటర్లు గమనించవలసిన అవసరం ఉంటుంది అంటే ఆయా పార్టీల పుట్టుపూర్వోత్తరాలను, నాయకవర్గాలను కూడా గమనించవలసిన అవసరం ఉంటుంది కేవలం పార్టీలనే గమనించి అభ్యర్థుల గుణగణాలను, సమర్థతనూ, వ్యక్తిగతమైన అంశాలనూ గమనించరాదని ఎల్లప్పుడూ చెప్పరాదు జాతిగా అవినీతిపరులూ, అసమర్థులూ అయినవారి విషయం వేరు కాని పార్టీలూ, వాని కార్యక్రమ విధానాలూ ప్రధానమని మరిచిపోరాదు

మద్రాసు రాష్ట్రంలో దాదాపు పదిహేను పార్టీలవరకూ ఎన్నికలలో పోటీ చేస్తున్నప్పటికీ, చెప్పుకోదగిన బలం, బలగం, సుబోధకం కాగల కార్యవిధాన సూచన నాలుగైదు పార్టీలకు మాత్రమే కనపడుతుంది వీనిలో ముఖ్యమైనవి (మన రాష్ట్రంలో) కాంగ్రెస్ పార్టీ, సోషలిస్టు పార్టీ, ప్రజాపార్టీ, కమ్యూనిస్టు పార్టీలు పార్లమెంట్‌లో మద్రాసురాష్ట్ర ప్రాతినిధ్య స్థానాలు, మద్రాసు శాసనసభాస్థానాలు

[సూర్యనారాయణ]

దాదాపు అన్నిటికీ కాంగ్రెస్ పోటీ చేస్తున్నది సోషలిస్టుపార్టీ, ప్రజాపార్టీలు దాదాపు సగం స్థానాలకు పోటీ చేస్తున్నాయి కమ్యూనిస్టుపార్టీ మూడోవంతు స్థానాలకు పోటీ చేస్తోంది ఏ కొద్దో మినహా అన్ని స్థానాలకూ స్వతంత్ర అభ్యర్థులు పోటీ చేస్తున్నారు

ఈ పార్టీలు, పార్టీలునిలబెట్టిన అభ్యర్థులు, అవి ప్రచారంచేస్తున్న విధానాలూ చూస్తే ఒక విషయం బోధపడుతుంది పార్టీల నిర్మాణమూ, పార్టీలు ప్రచారంచేసే దేశీయ పరిపాలనా విధానమూ దోషరహితమైనవని చెప్పడానికి ఒక్కటీ లేనిమాట నిజమే కాని ప్రజాస్వామ్య పరిపాలనా విధానాన్ని అమలు జరిపే పద్ధతిని అనుభవం దృష్ట్యా సంస్కరించుకోడానికి కాంగ్రెస్‌పార్టీ సంసిద్ధత కనపరుస్తోంది ఎన్నికల అనంతరం కాంగ్రెస్‌సంస్థ నిర్మాణాన్ని సంస్కరించదల్చుకున్నట్లు కాంగ్రెస్ అధ్యక్షులు పండిట్ నెహ్రూ చెప్తున్నారు సోషలిస్టుపార్టీ ప్రజాపార్టీలకు తమ పార్టీలను సంస్కరించుకోవలసిన అవసరం గోచరించడం లేదంటే, దానికి కారణం, దేనిని సంస్కరించాలో, అసలు ప్రాతిపదిక ఎట్టిదో కూడా ఆ పార్టీల నాయకులే స్పష్టంగా గ్రహించకపోవడం

ఆయా పార్టీల ప్రణాళికల్ని పరిశీలించే ముందు ఒక ముఖ్యమైన అంశాన్ని చెప్పడం అవసరం ప్రజాస్వామ్య విధానం ఆచరణలో అన్నివర్గాల ప్రజలకూ ప్రయోజనకారి కాగలదన్న విశ్వాసాన్ని ప్రజలలో పురిగొల్పవలసిన బాధ్యత అన్ని పార్టీలపైనా ఉంది అన్ని దేశాలలోనూ కాలానుగుణంగా ప్రభుత్వ ప్రభావం ప్రజల జీవనంలో వృద్ధి చెందుతోంది వ్యక్తిగత జీవనానికి సంబంధించిన సర్వ రంగాలలోనూ ప్రభుత్వంతో బాంధవ్యం ఏర్పడుతోంది నిత్యజీవనంలో ప్రతిమనిషీ తన కార్యకలాపాలలో ప్రభుత్వంపై ఆధారపడుతున్నాడు ప్రభుత్వ కార్యకలాపాల్ని నానాటికీ విస్తరిస్తున్నాయి ంచి దేశంలోని అన్నివర్గాల వ్యక్తులతోనూ ప్రభుత్వం కొత్త సంబంధాలు ఏర్పరచుకుంటోంద ప్రభుత్వ పరిపాలనా వ్యాసంగంలోనూ, ప్రజల నిత్యజీవనంలోనూ ప్రభుత్వమూ, ప్రజలూ పరస్పరం ఆధారపడుతున్నారు ప్రజలకూ ప్రభుత్వానికీ మధ్య సంపూర్ణ సహకారం లేకపోతే ప్రజలకు నిత్యజీవనం దుష్కరమయ్యే పరిస్థితి వచ్చింది, ప్రభుత్వానికి పరిపాలన సక్రమంగా నిర్వహించడం దుర్ఘటమయ్యే పరిస్థితి వచ్చింది ఈనాడు ప్రజలు ప్రభుత్వంపట్ల అసంతృప్తి చెందుతున్నారంటే, ఇది కేవలం మన కాంగ్రెస్ ప్రభుత్వం దోషం కాదు ఈనాడు ప్రపంచంలో ప్రభుత్వంపట్ల ప్రజలు అసంతృప్తి చెందని దేశమంటూ లేదని చెప్తే అది అతిశయోక్తి కాదు అది నేటి వాస్తవ పరిస్థితి కాంగ్రెసే కాదు ఏపార్టీ ప్రభుత్వంలో ఉన్నప్పటికీ, ఆ పార్టీ ప్రభుత్వంపట్ల ప్రజలు అసంతృప్తిచెందక తప్పదు ప్రపంచమంతటా పరిస్థితి ఇలా ఉన్నదంటే కారణం ప్రజలూ ప్రభుత్వమూ పరస్పరం

(48-వ పేజీ చూడండి)

పెద్దకథ

# అపశ్రుతులు

శ్రీ యన్.ఆర్ నంది

[గత సంచిక తరువాయి]

## 3

నకి వచ్చిందని తెలీగానే, స్నేహితురాండ్రు, సహపాఠినులు చూడ్డానికి వచ్చారు తీసిపోయిన ముఖాన్ని చూసి ఆశ్చర్యంగా 'ఇదేవిఁటే నాలుగేళ్ల కాపురానికే నాయనమ్మవై పోయావ్!' అని ఎగాదిగా పరీక్షించ మొదలు పెట్టారు జానకి చిరునవ్వు నవ్వి వూరుకొంది

వీళ్ళతో బాటు ముత్తైదువలు, యిల్లాళ్ళు గూడ వచ్చారు వాళ్లూ ఇదే ఆశ్చర్యాన్ని వెలిబుచ్చారు అసలు జానకి ఏ పండగా పబ్బమూ లేంది ఎందుకు అగస్మాత్తుగా వచ్చిందో వాళ్లంతగా పట్టించుకోలేదు ఏవేవో తనకి, తన కాపురానికి సంబంధించిన ప్రశ్నలు యధాలాపంగా వేశారు ఏదో సమాధానాలు జానకి ముక్తసరిగా చెప్పింది ఆడవాళ్లు యింకా ఏవేవో అడిగారు అసలు విషయం వీళ్ళకేం తెలుసు అనుకొంది జానకి

ఈ కుటుంబంలో గూడ కొన్ని మార్పులొచ్చాయి మధ్యాహ్నం సుందరమ్మ అరుగుమీద వేసుకొనే బాతాఖానీకి తులసమ్మ హాజరు కావటం లేదు మొదటిరోజు ఎదో అనుకొన్నారుగాని, వరసగా మూడు రోజులు రాకపోయేసరికి నిజంగా వాళ్లకి సంగతి వింతగానే తోచింది స్వయంగా తులసమ్మని చూసిన ఒక యిల్లాలు అంది

"ఏవిఁటోనమ్మా!. మాట లేదు, మంతి లేదు ఒంటరిగా కూచొని ఏదో ఆలోచిస్తుంటుంది పలకరించినా పరధ్యానంగా ఊఁ-అంటుంది, లేకపోతే అదీ లేదు"

నిజమే తులసమ్మలో పెద్ద మార్పు వచ్చింది నిలబడ్డా, కూచొన్నా, ఏ పని చేసినా కూకురుతలంపే ఆమె జీవితం ఏవిఁటి అనే ఆవేదనే! కాని జానకలో యిలాంటి మార్పు లేమీ కనిపించ లేదు అయితే జానకి రాకకి, తులసమ్మ మూగనోముకి ఏదో సంబంధం వుండకపోదని ఒక యిల్లాలు ఈ విషయాన్ని కదిపింది

తల్లి ఏదో మళ్లా బుచ్చిమీదికి సూటీలు విసురుతుందని జానకి భయపడింది కాని తులసమ్మ చాలసేపటివరకూ ఏం మాటాడకండా, చివరికి ఒక దీర్ఘనిట్టూర్పు విడుస్తూ "ఏం చెప్పమంటావమ్మా యిదంతా ఖర్మ" అంది బాధగా

ఆమె అంతటితో ఆగలేదు తటపటాయించి, తులసమ్మని లేపి అసలు రహస్యాన్ని తెలుసుకోవాలనే దుగ్ధతో, యింకా ఏదో అడిగింది కాని ఛప్పున జానకి లోపలనించివచ్చి ఊర్ధ్వస్వరంతో—

"అవన్నీ ఎందుకు సుందరమ్మత్తా, పోనిస్తూ" అంది

సుందరమ్మ నోరు నొక్కుకొని జానకికేసి చూసింది

"అదేవిఁటమ్మా అలా అంటావ్! నీ కష్టసుఖాలు మాకు కాక మరెవ్వరికి? ఈవాళ నువ్వు ఇంద్రభోగాల ననుభవిస్తుంటే మేం చూసి మురిసిపోతాం నువ్వు సుఖంగా వుంటే, మేం కొండెక్కినంత ఆనందపడతాం అలాంటిది నీకిలాంటి కష్టంవస్తే నోరు నొక్కుకొని ఎలా కూచొంటామమ్మా?"

పోనీ అవన్నీ మీకెందుకు మీ గొడవ మీరు చూసుకోండురూ—అని నోటి చివర వరకు వచ్చినమాటల్ని ఆపుకొంది జానకి అలా కట్టె విరచినట్టు మాటాడితే, సానుభూతి చూపవచ్చిన సుందరమ్మే, తనమీద చాటుప్రచారం సాగిస్తుంది

మళ్లా సుందరమ్మే అంది "అంతా చాలవరకు తెలిసింది, తల్లీ ఒకళ్ళ కర్మానికి మరొకరు కర్తలు కారు చూడు, ఎంతైనా మనస్సు కదా? ఇంతవరకు పువ్వుల్లో పూజించి, చివరికి ముళ్ళల్లో చేజేతులా తోసేసుకొన్నామే అని బాధపడుతుంటుంది"

ఈ మాటలు బలంగా ఒక వ్యక్తిని బాధపరుస్తవని జానకి భయపడింది

"పోనీ అత్తా, యిహ వూరుకోండురూ"

సుందరమ్మ ఈ మాటలు 'పాపం, జానకి నిజంగా అభాగిని' అనే అభిప్రాయానికి తోసేశాయి "ఇంత అమాయక జీవానికి అలాంటి రాక్షసుడు దొరికాడు" అంది

జానకికి మహా చిరాకు వేసింది లేచి లోపలికి వెళ్లిపోయింది అయినా సుందరమ్మ వూరుకోలేదు ఇంకా ఏవిఁటేవిఁటో ప్రశ్నిస్తూనే వుంది కాని తులసమ్మ మాత్రం మూగప్రతిమలా కూచొనివుంది

ఇంతవరకూ లోపల ఏదో రాసుకొంటున్న బుచ్చిబాబు ఈ మాటలు కలిగించిన చిరాకువల్లో, లేక నిజంగా ఏదైనా పనుండో —లేచి చరచర బయటకి వెళ్లిపోయాడు అతని వెనకనే ఆతృతగా వచ్చిన జానకి—బుచ్చి దాటిపోగానే, అటు సుందరమ్మకేసి ఉక్రోషంతో ఒక చూపుచూసి విసురుగా తలతిప్పుకొని లోపలికి వెళ్లిపోయింది

వచ్చి నాలుగు దినాలన్నా కాలేదు! వీధివాళ్ళందరికీ తన విషయమే కావలసివస్తోంది ఎంతో తమకీ, తన సుఖదుఃఖాల్లో పాలువున్నట్టు మాటాడుతున్నారు తను అసహ్యించుకొన్నా వాళ్లు వూరుకోరు! ఇంకా, యింకా మాటాడతారు దీనివల్ల యింట్లో వాతావరణం మారుతుంది పార్టీలుగా విడిపోతారు సూటీలు, పోటీలు,

యూతి నిరుపులు—చివరికి ఏదో పెద్ద అఘాతం తగిలేతేగాని శాంతించరు అన్నిటికీ తనే మూలమని, తనమీద తనకే విరక్తిపుట్టే విషవాతావరణాన్ని సృష్టిస్తున్నారు

తను ఎక్కువగా జాలిపడేది బుచ్చి గురించి బుచ్చిలో ఎలాంటి తప్పూలేదు అతన్ని అనవలసిందికాదు తల్లి గూడ కొద్దిగా శాంతపడింది—తన బోధవల్ల కాని ఈ ఆడవాళ్లుమాత్రం సానుభూతిగా మాటాడుతూనే, ఆమె గాయాన్ని లేపి కారం చల్లుతున్నారు ఫలితాలు కుటుంబ కలహాలు బుచ్చి యిప్పుడు రాసుకొంటున్న వాడల్లా దిగ్గునలేచి వెళ్ళిపోవడం అందుకే

బుచ్చి తిరిగివచ్చేసరికి సాయంకాలమైంది వెంట జగన్నాధాన్ని గూడ తీసుకొచ్చాడు బుచ్చిని పలకరించాలని వచ్చిన జానకి, ఈ అపరిచితుణ్ణిచూసి వచ్చినట్టే లోపలికి వెళ్ళిపోయింది

స్నేహితులిద్దరూ చాలసేపు ఏవేవో మాటాడుకొన్నారు ఏ విషయంగురించో కీచులాడుకొన్నారు వాదించుకొన్నారు చివరికి జగన్నాధం తల వంచేసరికి బుచ్చి విజయహాసం చేశాడు ఇంతలో లోపలనించి 'టీ' తీసుకోమన్న పిలుపు వినిపించి బుచ్చి లోపలికివెళ్లాడు తిరిగి రెండు కప్పులతో ప్రత్యక్షమయ్యాడు కాళీచేసి యిరువురూ బయటికి వెళ్లిపోయారు

చీకటి బాగాపడిన తర్వాత బుచ్చి ఒక్కడు తిరిగివచ్చాడు భోజనం అయిన వెంటనే ఆ రాతలో నిమగ్నుడయ్యాడు

గంటలు గడచిపోతున్నాయి మెల్లగా జానకి బయట పక్క వేసుకొంది కాని నిద్రపట్టలేదు పోనీ బుచ్చితో ఏదన్నా కాలక్షేపం చేసుకొందామంటే, ఆయనేదో మహాపర్వాలు లిఖిస్తూ కూచొన్నాడు ఏం పాలుపోలేదు ఏదన్నా పుస్తకంవిప్పితే చదివింది తలకెక్కదు! ఏవో కలతలు— దృష్టిని బుద్ధిని చెదరగొట్టేవి ఇక ఈవేళ లాభంలేదు నిద్రరాదు లేచింది లేఖిని చప్పుడు మరీ ఎక్కువగావుంది మెల్లగా లోపలికివచ్చింది బుచ్చి ఆమెని గుర్తించలేదు చాలసేపు కుర్చీ నానుకొని నిలబడింది ఇక లాభంలేక మెల్లగాపిలచి అడిగింది

"ఏవిటా బ్రహ్మరాత ?"

బుచ్చి తలతిప్పి స్వరం వినిపించినవేపుకి చూశాడు జానకి ఎదురుగా వచ్చింది కలాన్ని డ్రాయరుమీద వుంచి విశ్రాంతిగా కుర్చీకి చారబడ్డాడు ఆవలిస్తూనే అన్నాడు, రాసేది కథ అని

"కథావస్తువు ?"

"సమాజం, సమాజంలో వ్యక్తులు, వ్యక్తుల్లో 'దౌర్బల్యం"

"ఇంకేం ? రాజుగారి ఏడు చేపల కథలా వుంది అయితే విమర్శా ?"

"విమర్శన, సమర్థన—రెండూను"

"ఆధారం ?"

"నా అనుభవం"

"గురి ?"

"నువ్వు—ఏ మీన్—ఒక అభాగ్యురాలు"

"క్లైమాక్స్ ?"

"సమాజంలో వచ్చే కలతలు, సంస్కరణ"

"ముగింపు ?"

"ఆ అభాగ్యురాలి బలి"

"హాఁ!" అంది ఒక్కసారే జానకి ఎందుకో గుండె దడదడమంది ఇది గ్రహించే బుచ్చి మెల్లగా కుర్చీలోంచి లేచి ఇటూ అటూ పచార్లుచేశాడు జానకినైతే పరీక్షగా చూడలేదుగాని, ఈ మాటలకి ఆమెలో ఎలాంటి సంచలనం కలుగుతుందో తెలుసు మెల్లగా ఈ విషయాన్ని విశదీకరిస్తున్నట్టు అన్నాడు

"ఇద్దరు స్త్రీలని తీసుకొని రాస్తున్నాను జానకీ ఒకతె పరదాలవెనక పెరిగి ప్రపంచమంటె ఏవిటో తెలీని మూర్ఖురాలు, రెండవది కొంతవరకు చదువుకొని, కాస్తోకూస్తో ప్రజల్ని అర్థంచేసుకొని చివరికి మూర్ఖుల మధ్య కొంతెత్తి అరవలేక గింజుకు చచ్చిపోయిన అభాగిని వీళ్లిద్దరిచావు సమాజాన్ని కదపలేదు కాని కదిపినట్టు మరోవిధాన రాస్తున్నాను. అదే సమాజాన్ని ఉద్ధరించే మార్గం"

ఈ మాటలు అంటున్నప్పుడు బుచ్చి ముఖంలోకూడిన రక్తం, వణికిన పెదవులు జానకిని చాల భయపెట్టాయి కాని చివర ధ్వనించిన ఆశావాక్యాలతో కాస్త స్థిమితపడి మెల్లగా అంది "మనలో లోపం వుంచుకొని సమాజమేదో సజీవప్రాణి అన్నట్టు విమర్శిస్తే లాభమేవిఁటి బుచ్చి ?"

"నా మాటలు నీకు అర్థంకాలేదు మన మందరం కలిస్తేనే సమాజం కాని దురదృష్టవశాత్తు మనం సమాజంలో అనామకులం అజ్ఞానప్రజ నోరే సమాజంలో ఎక్కువగా వినబడుతోంది వాళ్ళ మతి ఎంతో, గతీ అంతే అన్నట్టు ఆ చిన్నపిల్లలనిగూడ అసూయాపరులుగా తయారుచేస్తున్నారు దాంతో స్వార్థం, ఈ స్వార్థంనించి 'నా' అనే పరిమితత్వం, అందునించి చూస్తూ, కాస్త ఆధునికభావాలు కలవాళ్లని కుర్రకుంకలని తిట్టి శపించడం, అవే వాళ్లకో 'హాబీ' అయిపోయింది వాటికి ఎంతోమంది గురి అవుతున్నా, వాళ్లు గుణపాఠాలు నేర్చుకోలేకపోతున్నారు మనం వీళ్ళని బోధిస్తూ ఒకదారికి తీసుకరాలేంగాని, సాహిత్యంతో కొంతవరకూ వీళ్ళని బాగు చెయ్యగలం అందుచేత 'ఆ అభాగినులని బలిచేసి—మరో స్త్రీలో జ్ఞానబోధ కలిగిస్తాను"

జానకి కాసేపటివరకు ఏం మాటాడలేదు బుచ్చిమాటల్ని అవగాహన చేసుకోడానికి ప్రయత్నిస్తోంది ఒకసారి ఆ కాగితాలకేసి చూసి, మళ్లా బుచ్చికేసి దృష్టిని తిప్పుకొని అంది·

"కథని ఏ ఏంగిల్నించి ప్రొసీడ్ చేస్తావ్ ?"

"మగవాడికి స్త్రీమీదవున్న చిన్నచూపునించి"

"మరి యిందులో సమాజానికి సంబంధం?"

"మాధవమ్మగారలని పట్టుకొని వేళ్ళాడే ముసలివాళ్ళ మూలంగులు చదువుకొన్న

(34-వ పేజీ చూడండి)

# ఉపద్రవకరమగు కీటకములను చంపుదు

• అవి మలేరియా, టైఫాయిడ్, గ్రహణి, కలరా, మరియు అనేక యితర వ్యాధులను వ్యాపింపచేయును!

ఈగలు దోమలు బొద్దంకులు, మరియు నల్లులు త్వరగా అసంఖ్యాకములుగా పెరుగును అవి మురికిలో నివశిం చుచు మీకు ప్రాణహానిని కల్గించగల క్రిములను యింటిలోనికి తెచ్చును ఒక్క ఈగపై 6,000 000 క్రిములుండుట కనుగొనబడినది

కీటకము చిన్నదిగా నిరపాయకరముగా అగుపడినను అది మీకు ప్రాణాపాయభయమును కల్గించవచ్చును మీకు సోకకముందే కీటకములనులన్నిటిని చంపుడు ఫ్లిట్ లోగల వీ తీవ్రమగు కీటకనాశనులు అన్ని కీటక ములను త్వరగా నిశ్చయముగా చంపును




స్టాండర్డు-వాక్యూమ్ ఆయిల్ కంపెని (మెంబర్ల బాధ్యత పరిమితము)

# ఇదేనా బ్రతుకు?

శ్రీమతి జె. రుక్మిణి

శివరామ్ మున్సిపల్ ఆఫీసులో గుమాస్తా. అతను ప్రవేశించి పనిలో నాలుగేండ్లయింది పెండ్లి అయిన మరో మాసములో చేరాడు "మీ ఆయనకు ఏమిటే పని" అని సీత మేనమామ అంటే "మున్సిపల్ ఆఫీసులో పని" అంది పాపము అమాయకురాలు ఆమె కేమి తెలుసు పైగా చిరునవ్వును నడపించింది పెదవులమీద పోనీ, మంచిచెడ్డలు ఆ మేనమామ చెప్పినా బాగుండిపోయేది "దానికేం? బంగారమంటి వుద్యోగం మార్పులు మన్నూ వుండవు హాయిగా ఒకచోటపడి వుండవచ్చు అదిమటుక్కు తీసిపోయిందా! లోకలు గవర్నమెంటు" అన్నాడు ఆయన

సీత కాపురానికివచ్చి మూడేళ్ళయింది ఆమె యిద్దరు ముగ్గుర్ని చూచింది వారు శివరామ్‌పనిచేసే ఆఫీసులోనే గుమాస్తాలు ఏదో ఒకటి పునిష్‌మెంట్ అనుభవిస్తూవుండేవారు అటువంటివే తనభర్తకు ఎన్నో మధ్య వస్తూవచ్చాయి ఒకసారి, శివరామ్ శెలవు పెడితే దానిని మంజూరు చేయక పదిరోజులు జీతము ఆపుచేశారు శివరామ్‌ని "నువ్వు ముందు ఎందుకు శెలవు చీటి పంపలేదన్నారు నువ్వు నిజంగా నీ భార్య తీసుకువచ్చుటకు వెళ్ళావని నమ్మకము ఏమిటన్నారు నువ్వు శెలవు చీటీలో వ్రాసిన వూరే వెళ్లావని రుజువు ఏమిటన్నారు నువ్వు తెనాలి ప్లాటుఫారం మీద కనబడ్డావు అని బసవలింగయ్య చెప్పాడు అన్నాడు ఆఫీసరు "చివరకు ఏదోవిధంగా శెలవు మంజూరు చేశాము అని పదిరోజుల తరువాత జీతము యిచ్చారు శివరామ్‌కు ఇదంతా సీతకు చాల ఆశ్చర్యము వేసింది" ఖర్మం కాలిపోకపోతే ఒక వూరు వెళ్లవలసినవారు మధ్య దారిలో వున్న వూళ్లలో కారులోనో, నడుస్తూనో, ప్లాటుఫారంమీదో, రిక్షాలోనో, కాఫీ హోటలులోనో కనబడరు" ఆమెకు యిదంతా ఒక గొడవగానే వుంది తన మేనమామ యిటువంటి ఆఫీసును ఎలా పొగడాడు అనుకుంది ఆమెకు మొదట యిలాంటి ఆఫీసని ఏమి తెలుసు ఇటువంటి గొడవలుగల కచేరి అనుకుంటే, ఏదో ఎలాగైనా నయానో, భయానో, ఆ గుమాస్తాలోనుంచి మాన్పించి యుండేది ముందు చేరకుండానే చూచేది. మీవారి వుద్యోగం యిలాంటిదమ్మా! అనే చెప్పేమనిషి ఒకరువున్నా బాగుండేది అనుభవమయి అవగాహన చేసుకున్న తరువాత మున్సిపాలిటీ నౌకరీ అంటే తెలుసుకుంది శివరామ్ చెప్పే సంగతులును గురించి మున్సిపాలిటి నౌకరీ మానుకోనమని కోరింది తన భర్తను రెండు మూడు సార్లు

* * *

ఆనాడు సాయంత్రము శివరామ్ యింటికి చాల ఆలస్యంగా వచ్చాడు. చాల విసుగ్గావున్నాడు ఆమె అన్నం వడ్డించేసరికి చాల కసురుకున్నాడు అన్నం చల్లారిందన్నాడు రాళ్లురప్పలు ఉన్నాయ్ అన్నాడు కూర ఆమె ముఖమల్లె వుందన్నాడు ఇంకా ఏమిటేమిటో వికారంగా మాట్లాడాడు ఇదంతా చూసి సీత గ్రహించుకున్నది కచ్చేరి వ్యవహారాలే కారణమయివుంటాయి అని వూహించింది శివరామ్ అలాగా ఏదో తిని వెళ్లి పడుకున్నాడు ఆమెకూడ నాలుగు మెతుకులు తిని శివరామ్‌వద్దకు చేరింది అతను అదో దూదిరిగా వున్నాడు కళ్లుమూసుకుని అయోమయంగా పడుకునివున్నాడు అప్పుడే సినిమా వదిలిపెట్టారు రోడ్లవెంబడి జనం కబుర్లు చెప్పుకుంటూ వెడుతున్నారు నిత్యము సంసారములో జరిగే సంఘటనలునోరుమూసుకుని పడివున్నాయ్ వాళ్ల మనస్సుల్లో తనభర్తను లేపి సంగతి ఏమిటో తెలుసుకుందామనుకుంది

"ఏమండీ! మిమ్మల్నే" అంది ఆమె

"ఎవరది?" అన్నాడు శివరామ్ వులిక్కిపడి

"నేనేనండి"

"ఏం?"

"అలావున్నారేమండీ?"

"ఏం లేదులే"

"కాదండీ చెప్పండి" అని చాల వినయంగా అడిగింది ఆమె వినయానికి చెప్పాలా? వద్దా! కాని మరొకటి అనుకున్నాడు తన కష్టసుఖాలు చెప్పటానికి మరెవ్వరున్నారు? దగ్గరవున్నదిఆమె చెప్పదామనుకున్నాడు కిటికీలోనుంచి తొంగి చూచాడు బైట ఎలక్ట్రిక్ లైటుకాంతి ప్రాకారాలు దాటి ఆకుల సందులుండా చెదరివచ్చి గోడప్రక్కనున్న వేపదుంగను గట్టిగా కౌగలించుకుంది

"ఇదిగో సీతా! విను మనము వచ్చి యీ యింట్లో ప్రవేశించి మూడేళ్లయింది అదుగో ఆ దుంగన చూడు అదొక బాధ అనుభవించింది అదే బాధ నేను అనుభవిస్తున్నా మే మిద్దరము స్నేహితులమే మాకు చాల పోలికలున్నాయ్ తెలుసా?"

"పోలిక ఏమిటండి"

"పోలిక చాల పోలికవుంది ఆ వేప చెట్టు అడవిలోపుట్టి, అడవిలో పెరిగితే బావుండిపోయేది దాని జీవితము హాయిగా సుఖంగా వెళ్ళిపోయేది కాని పిచ్చిది తెలియకో, ఖర్మం చాలకో యీ దొడ్లో పుట్టింది అప్పుడే దాని జీవితాన్ని నాశనము చేసుకుంది ఒకనిదగ్గర హాయిగా బ్రతుకుదామని వచ్చి, అతనికి బానిస అయింది ఈ మూడేళ్లలో అవసరము వున్నప్పుడల్లా యజమాని దాని కొమ్మలు నఱుకుట చూశాం ఆఖరికి సంబంధంలేని పెత్తనంలేని కంపెనీవాళ్లు వచ్చి ఎలక్ట్రిక్ తీగలకు అడ్డవచ్చిందని రెండునెలల క్రిందట నఱికిపోయారు ఇప్పుడు మొదలంటానఱికొడుయజమాని అంతేనాపని"

సీతకు అతను చెప్పినమాటల్లో ఏమీ అర్థం కాలా! చెట్టుకు తనకు పోలిక ఏమిటి అది పూర్తిగా తెలుసుకోవాలనుకుంది ఆ సంబంధం ఏమిటో అడిగింది

"ఇదిగో విను సీత! విను ఆఫీసు విషయాలు నీవు కొంచెం అవగాహన చేసుకున్నావనుకుంటాను నేను ఆఫీసులో ప్రవేశించి నాలుగేళ్ళయింది నాలుగేళ్ళలో జరిగిన సంగతి యిది ఒక కౌన్సిలరు వారికి చాటుగా ఇన్ఫర్మేషన్ ఆఫీసరుకు తెలియకుండా యివ్వలేదని ఏదో లేనిపోని పెటీషను పెట్టి ఆఫీసరును వెంబడించి ఒక సంవత్సరము ఇంక్రిమెంట్ ఆపు చేయించాడు మరొకసారి మరొక ఫనిష్మెంట్ యిచ్చారు మున్సిపాలిటీ నౌకరీ అంటే యిప్పుడు అవగాహన అయింది కౌన్సిలరుకు వంగివంగి సలాము చేయాలి అధికారములోవున్న పార్టీకి చెయ్యెత్తి, తలవంచి, అడుగులకు మడుగు లొత్తాలి వ్యతిరేకపుపార్టీ యిది సహించలేక గవర్నమెంటుకు పిటీషను పెడితే వుద్యోగం వూడుతుంది కొందరు ఎదురుగుండానే అనవలసినమాటలు అనిపోతారు కొందరు కాగితంమీద చేస్తారు గుమాస్తా, ఆఫీసరుకు అటు కౌన్సిలర్లుకు వ్యతిరేకమవుతాడు కొద్దికాలములో ఎదోఒక నెపము పెట్టి మొదలంట నఱికినటుల యింటికి పొమ్మంటారు కాబట్టి ఈనాడు ఆ చెట్టుకు నాకు భేదములేకుండా ఒకటే ఫనిష్మెంట్ అనుభవిస్తున్నాము" అన్నాడు శివరామ్

సీత యిదంతా విని చాల సంతోషించింది ఆమెకు దుఃఖము రాలా! భర్తకు ధైర్యాన్ని పురికొల్పింది శాంతిని కూర్చింది కిటికీలోనుంచి ఆ చెట్టును చూపమన్నది గోడప్రక్కన హాయిగా ఆ చెట్టు "ఇదేనా బ్రతుకు" అంటూ పడి వున్నది ఎలక్ట్రిక్ కాంతి మంచి ధైర్యాన్ని శాంతిని కూర్చుంది దానికి. అంతే అదే. ★



# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

## అలెగ్జాండర్ డ్యూమా

### 89

వాలంటిన్ శవం వద్ద బుసోనీ ప్రార్థనలు జరపడంవల్లనో, వృద్ధునికి జ్ఞానబోధ చేసినందువల్లనో వృద్ధుడూ దైన్యం మరిచిపోయి మనసు దిటవుపరుచుకున్నాడు దుఃఖాన్ని మరిచిపోయి మామూలు పరిస్థితికి వచ్చేసిన వృద్ధునిచూసి ఇంటిలోని వారందరూ ఆశ్చర్యపడ్డారు వృద్ధుని వద్ద కొత్త పరిచారకుడు నియమించబడ్డాడు విల్ ఫర్ట్ కి న్యాయస్థానంలో పని దగ్గరపడింది బెనెడెట్టోపైన కేసు మరుచటిరోజే విచారణకు వస్తుంది

సాయంకాలం విల్ ఫర్ట్ పని విరమించుకుని తోటలో పచారు చేస్తున్నాడు యథాలాపంగా ఇంటివైపు చూశాడు ఒక కిటికీవద్ద తన కుర్చీలో కూర్చుని వృద్ధుడు ఒక చోట ఏకాగ్ర దృష్టితో చూడ్డం గమనించాడు వృద్ధుని చూపులో క్రోధం, ద్వేషం ఉట్టిపడుతున్నాయి వృద్ధుడు చూస్తున్న దిక్కుగా విల్ ఫర్ట్ చూశాడు చూడగానే అతని ముఖం పాలిపోయింది అక్కడొకచోట పచ్చికపైన హీలాయిస్ విల్ ఫర్ట్ కూర్చుంది కుమారుడు సమీపంలోనే ఆడుకుంటున్నాడు విల్ ఫర్ట్ తిరిగి తన తండ్రి వంక చూశాడు ఈమారు తండ్రి దృష్టి తనపైనే ఉంది వాడి చూపులు భరించలేక విల్ ఫర్ట్ తల వొంచుకున్నాడు అతనికి తెలియకుండానే అతని కాళ్లు అతన్ని కిటికీవద్దకు లాక్కువెళ్లిపోయాయి "నేను మర్చిపోలేదండి" అన్నాడు తండ్రితో "ఇంకొక్కరోజు ఓపిక పటండి, నేను చెప్పినది తప్పకుండా నెరవేర్చగలను" వృద్ధునికి తృప్తి కలిగింది

ఆ రాత్రి విల్ ఫర్ట్ కి సరిగ్గా నిద్రపట్టలేదు ఉదయం లేచే సరికి కన్నులు జ్యోతులవలె ఉన్నాయి పరిచారకుగు పత్రికలు, పాలు తీసుకువచ్చాడు విల్ ఫర్ట్ పాలగిన్నె వంక భీతితో చూశాడు

"అదేమిటి?" అన్నాడు

"పాలు"

"నేను తీసుకురమ్మనలేదే! ఎవరు పంపారు?"

"అమ్మగారు పంపారు" అంటూ గిన్నె మేజాపైన పెట్టి పరిచారకుడు వెళ్లిపోయాడు

విల్ ఫర్ట్ జాగ్రత్తగా గిన్నె తీసి పట్టుకున్నాడు ముందు కొద్దిగా చప్పరించి చూశాడు తరవాత గడగడ తాగేశాడు పదకొండు గంటలకు భార్యకు కబురు పంపాడు హీలాయిస్ విల్ ఫర్ట్ కుమారునితో సహా వచ్చింది రాగానే అతని ముఖం గమనించింది "అదేమిటి? ముఖం బొత్తిగా పాలిపోయింది రాత్రినిద్రపోలేదా?"

విల్ ఫర్ట్ జవాబివ్వలేదు ఆమెవంక తేరిపార చూశాడు

"మీరు విచారణకు వెళ్లవలసిన సమయమయింది"

జవాబు లేదు ఎడ్వర్డ్ వంక తీక్షణంగా చూశాడు "ఎడ్వర్డ్! నువ్వు సావడిలోకి వెళ్లి కొద్దిసేపు ఆడుకో," అన్నాడు ఎడ్వర్డ్ తల్లివంక చూశాడు తరవాత మేజామీద పత్రాలవంక చూశాడు విల్ ఫర్ట్ కఠినంగా చెప్పాడు "ఎడ్వర్డ్! వెళ్లు!" అన్నాడు తండ్రికోపాన్ని ఎన్నడూ రుచిచూరగని కుమారుడు హడలిపోయాడు తండ్రి వెంటనే కొడుకుని అందుకుని ఆలింగనం చేసుకున్నాడు ఈమారు మెల్లిగా చెప్పాడు "వెళ్లి ఆడుకో నాయనా! నామాట విను" ఎడ్వర్డ్ వెళ్లిపోయాడు

హీలాయిస్ తెల్లబోతూ చూసింది కొడుకు వెళ్లిపోగానే విల్ ఫర్ట్ గది తలుపు గడియవేసి వచ్చాడు. గుమ్మానికి కడ్డుగా నిలబడి భార్యవంక తీక్షణంగా చూశాడు "నువ్వు వాడే విషాన్ని ఎక్కడ దాస్తున్నావు?" అన్నాడు

"ఏమిటి? అదేమిటి?" అంది హీలాయిస్ విల్ ఫర్ట్ తడబడుతున్న ఆమె మాటల్ని లక్ష్యపెట్టకుండా, విల్ ఫర్ట్ గద్దించి అడిగాడు "విషం ఎక్కడ దాచావని అడుగుతున్నాను నా అత్తమామల్ని, పరిచారకుణ్ని, నా కూతుర్ని చంపిన ఆవిషం ఎక్కడుందని అడుగుతున్నాను" హీలాయిస్ విల్ ఫర్ట్ నిశ్చేష్టురాలయింది నోట మాటరాలేదు కొంతసేపటికి తేరుకుని "ఏమిటంటున్నారు?" అంది.

"ప్రశ్నించవలసింది నువ్వు కాదు, నేను నాకు జవాబియ్యి" ఆమె ముఖం పాలిపోయింది కొంత ధైర్యం చిక్కబట్టుకుని ఇలా అంది "మీరు భర్తగా నన్నడుగుతున్నారా? లేక న్యాయమూర్తిగా అడుగుతున్నారా?"

"న్యాయాధికారిగా అడుగుతున్నాను చెప్పు" అని గద్దించాడు విల్ ఫర్ట్

"అయ్యో! అయ్యో!" అని మాత్రం అనగలిగింది హీలాయిస్.

"జవాబు చెప్పవేం? అయితే నీ నేరాన్ని ఒప్పుకుంటున్నావా? నువ్వే విషం పెటి చంపావా? నీపట్ల ఆపేక్షవల్ల అంధులైపోయినవారినే తప్ప అందరినీ మోసపుచ్చలేవు నేనింక ప్రేమ బాంధవ్యాన్ని తెంచుకుంటున్నాను నువ్వింక న్యాయమూర్తి సమక్షంలో ఉత్తరవాదివి" అన్నాడు విల్ ఫర్ట్

హీలాయిస్ ముఖాన్ని చేతులతో కప్పుకుంది కాతర స్వరంతో ఇలా అంది "అయ్యో! పైపైకి కనపడేవానిని చూసి మోసపోతున్నారు"

"పిరికిపంద! ఒక్కొక్కరు చొప్పున నలుగుర్ని విషప్రయోగంవల్ల చంపినదానవు, ఫలితాన్ని కనలేకపోయావా? కాగు ఇంకా ఏదో ఉంది అంతకంటె భయంకరమైన విషాన్ని దాచిపెట్టి శిక్ష తప్పించుకోవాలని చూస్తున్నావు కాబోలు అదైనా తెలివైనపనే అంటాను విషం ఉందా లేదా?"

హీలాయిస్ విల్ ఫర్ట్ భరించలేక పోయింది చేతులు చాచి అతని మోకాళ్లపై వాలిపోయింది

"అవును నీ నేరం ఒప్పుకుంటున్నావు కాని ఆఖరు క్షణంలో, నేరం తీరా బయటపడినతరవాత ఒప్పుకుంటే న్యాయాధికారులు క్షమించరు పూర్తిశిక్ష అనుభవించక తప్పదు"

"శిక్షా!"

"అవును న్యాయాధికారి భార్యవైనందువల్ల నీకు శిక్ష పడదనుకున్నావా? అలా వీల్లేదు విషప్రయోగం చేసిన హంత. మరణదండనకి సిద్ధపడవలసిందే నీకొక్కటే మార్గాంతరం ఉందికి

అనువాదం సీతారామ్

ఆవిషం నువ్వు కూడా తీసుకోవాలి" హిలాయిస్ విల్‌ఫర్ట్ భీతితో గజగజలాడి పోయింది, ముఖం వివర్ణమైపోయింది

"భయపడకు" అన్నాడు విల్‌ఫర్ట్

"నిన్ను న్యాయస్థానంలో నిలబెట్టి అవమానించను అది నాకూ అవమానమే విషం తీసుకుని ఆత్మహత్య చేసుకునే అవకాశం నీకిస్తున్నాను"

"అయ్యయ్యో!"

"చెప్పు, విషం ఎక్కడ దాచావు?"

"వొద్దు వొద్దు"

"న్యాయంజరిగి తీరలి నేరస్థుల్ని శిక్షించడం నా కర్తవ్యం కాని నీ పట్ల కనికరం చూపుతున్నాను పరువుగా నీ కర్తవ్యం నువ్వు నిర్వహించు"

"అయ్యో! ఎడ్వర్డ్ ముఖమైనా చూడండి నన్ను బ్రతకనివ్వండి"

"వల్లకాదు నువ్వింకా బ్రతికివుంటే వాణ్ని కూడా నువ్వే చంపుతావు"

"నేనా? నా కొడుకునా?" ఈమారు హిలాయిస్ విల్‌ఫర్ట్ పిచ్చిగా నవ్వ నారంభించింది తరవాత అకస్మాత్తుగా భర్త పాదాలపై పడిపోయింది

విల్‌ఫర్ట్ లోని ఉద్రేకాన్ని అణుచుకుంటూ ఇలా అన్నాడు అతని గొంతు బొంగురుపోయింది "నే నిప్పుడు న్యాయస్థానానికి వెళ్ళిపోతున్నాను తిరిగి వచ్చేలోగా నువ్వు విషం పుచ్చుకోకపోతే నా చేతులారా నీ చేతులకు బేడీలు తగిలించి ఖైదుకి పంపవలసి వస్తుంది నిన్ను న్యాయస్థానంలో విచారించవలసి వస్తుంది ఈమాట మరిచిపోకు" హిలాయిస్ విల్‌ఫర్ట్ నేలపై పొర్లాడింది విల్‌ఫర్ట్ ఆమె వంకనైనా చూడకుండా తలుపు తీసుకుని వెళ్ళిపోయాడు

న్యాయస్థానం కిటకిటలాడుతోంది బెనెడెట్టోపై కేసును గురించి పలువురు పలువిధాలుగా చెప్పుకుంటున్నారు డాంగ్లర్ ఇంటిలో ఆండ్రీ పరిచయం కల యువకుల విమర్శలకు మితిలేదు ఇవికాక ఆల్బర్ట్, కౌంటెస్ మార్సెర్ఫ్‌లు మార్సేల్స్ నగరానికి వెళ్ళిపోవడం డాంగ్లర్ పరారి మొదలైన విషయాలు కూడా చర్చించబడుతున్నాయి న్యాయస్థానానికి హెర్మినా డాంగ్లర్ కూడా రావడం యువకులకు ఆశ్చర్యం కలిగించింది డిబ్రే ఆమెతో మాట్లాడకుండా పెడముఖమై కూర్చోడం కూడా చర్చకు వచ్చింది భర్తపరారైన తరవాత హెర్మినా, డిబ్రే సులక్షాధికారులైనారన్న విషయం అందరికీ తెలిసింది ఆపైన విల్‌ఫర్ట్ ఇంటిలో నలుగురి చావుగురించి సంశయాత్మకమైన విమర్శలు వచ్చాయి

"అవి హత్యలే అంటావా?"

"తప్పకుండా"

"హంతకు డెవ రంటావు?"

"అదే చిత్రం ఎవరో తెలుసా? ఎడ్వర్డ్!"

"ఆ!"

"ఆశ్చ్ర!"

"అవును మీరు నమ్మినాసరే, నమ్మకపోయినాసరే అది నిజం".

"మాంట్‌క్రిస్టో కనపడ్డంలేదే?"

"అదీ చిత్రంగానే ఉంది"

న్యాయాధికారులు వచ్చి ఉన్నతాసనాలు అలంకరించడంతో రణగొణ ధ్వని ఒక్కసారిగా ఆగిపోయింది

పోలీసులు బెనెడెట్టోని తీసుకువచ్చి బోనులో నిలబెట్టారు బెనెడెట్టో నిర్భయంగా, ఠీవిగా నిలబడ్డాడు న్యాయస్థానమంతటా కలయచూశాడు తరవాత ప్రధాన న్యాయమూర్తివంక చూశాడు ఆపైన విల్‌ఫర్ట్ వంక తేరిపార చూడ నారంభించాడు అభియోగపత్రం చదవబడింది తరవాత ఆచారప్రకారం ప్రధాన న్యాయమూర్తి బెనెడెట్టో వంక చూసి, "నీ పేరేమిటి?" అన్నాడు

బెనెడెట్టో గొంతు సవరించుకుని ఇలా అన్నాడు "నన్ను క్షమించాలి ఈ ప్రశ్నకి సమాధానం తరవాత ఇవ్వడానికి అనుమతించవలసిందని ప్రార్థిస్తున్నాను లేనిపక్షంలో నేను దేనికీ సమాధాన మివ్వలేనని మనవిచేసుకుంటున్నాను"

"సరే! నీ వయస్సు?" అన్నాడు ప్రధాన న్యాయమూర్తి

"నా వయస్సు ఇరవయ్యొక్క సంవత్సరాలు నేను 1817 సెప్టెంబరు 27 వ తేదీ రాత్రి జన్మించాను" తేదీ వినగానే విల్‌ఫర్ట్ చురుక్కున చూశాడు

"ఎక్కడ జన్మించావు?"

"ఆటివ్లే గ్రామంలో"

విల్‌ఫర్ట్ రెండోసారి నేరస్థునివంక చురుగ్గా చూశాడు అతని ముఖం వివర్ణమయింది

"నీ వృత్తి?"

"మొదట ఫోర్జరీలు చేసేవాడిని తరవాత దొంగనైనాను ఇటీవల హత్య చేశాను"

న్యాయస్థానంలో కలకలం బయలుదేరింది

ప్రధాన న్యాయమూర్తి చకితులై నేరస్థునివంక చూశారు "నీ దొంగతనాలూ, హత్యలూ ప్రజ్ఞగా చెబుతున్నావు నీకు కఠిన శిక్ష వెయ్యకపోతే సమాజానికి హాని జరుగుతుంది నీ ప్రజ్ఞాప్రకర్ష కోసమే ముందు పేరు చెప్పలేదనుకుంటాను ఇప్పుడైనా నీ పేరు చెప్తావా?"

"మీరన్నదంతా అక్షరాలా నిజమండి నా పేరు నాకే తెలియదు అందువల్ల చెప్పలేనండి కాని నా తండ్రిపేరు తెలుసునండి కావలిస్తే అది చెప్పగలను"

"చెప్పు"

"నా తండ్రి న్యాయాధికారి విల్‌ఫర్ట్"

ప్రధాన న్యాయమూర్తి నిశ్చేష్టుడైనాడు "ఎవరు! న్యాయాధికారి విల్‌ఫర్టా?"

విల్‌ఫర్ట్‌కి ముచ్చెమటలు పట్టాయి

"అవునండి" అన్నాడు బెనెడెట్టో

న్యాయస్థానంలో కలవరం బయలుదేరింది ఎవరో ఒక స్త్రీ ఒక మూల కెవ్వుమన్నట్లు వినపడింది

ప్రధాన న్యాయమూర్తికి కోపం వచ్చింది "ఏమిటది! న్యాయస్థానంలో పరిహాసమాడుతున్నావా?"

విల్‌ఫర్ట్‌కి సత్తువ పోయింది ఒక్కసారి లేచి నిలబడి కుర్చీలో కూలబడిపోయాడు

బెనెడెట్టో ఇలా అన్నాడు "నే నెవ్వరినీ పరిహసించడం లేదు నేను మళ్ళీ అదే చెప్తున్నాను నా తండ్రి విల్‌ఫర్ట్. కావలిస్తే నిరూపించగలను కూడా"

యువకుడు చెప్తున్నది అసత్యమని సంకోచించడానికి వీలు లేదు అందరూ విల్‌ఫర్ట్ వంక చూడ నారంభించారు

ప్రధాన న్యాయమూర్తి కోపంతో అన్నాడు "కాని నీపేరు బెనెడెట్టో అని మొదట విచారణలో చెప్పావు తల్లితండ్రులు లేనివాడవన్నావు కార్సికాలో పెరిగానన్నావు అదంతా ఏమిటి?"

"అదంతా నిజమే కాని నేను చెప్పవలసినదానిని చెప్పితీరాలి నేను విల్‌ఫర్ట్ కుమారుణ్ని ఇంకా వివరాలు కావలిస్తే చెప్పగలను ఫాంటేన్ వీధిలో 28 వ నెంబరు ఇంటిలో

పుట్టగానే నేను చనిపోయినట్లు చెప్పి నా తండ్రి నన్ను తోటలోకి తీసుకువెళ్ళి బ్రతికుండగా నన్ను పాతిపెట్టాడు"

"ఇవన్నీ నీకెలా తెలిశాయి?"

"నా తండ్రిపైన పగసాధించాలని ప్రతిజ్ఞ తీసుకున్న ఒక వ్యక్తి నా తండ్రిని చంపడానికి ఆరాత్రే ప్రయత్నించాడు పాతి పెట్టినది ధనమని భావించి ఆ వ్యక్తి నేల తవ్వి నన్ను దాచిన పెట్టె తీసుకుని పారిపోయాడు తరవాత నన్ను ఒక ఆస్పత్రిలో దిగబెట్టి వెళ్ళిపోయాడు కొన్నిమాసాల అనంతరం కార్సికా నుంచి ఒక స్త్రీ వచ్చి నన్ను తీసుకుపోయి పెంచింది"

"తరవాత?"

"తరవాత నేను కార్సికాలో సుఖంగా గడపవలసిందే కాని, నా బుద్ధి విపరీతమార్గాలలో భ్రమించ నారంభించింది నా దురదృష్టానికి నన్ను నే నెన్నిమార్లో నిందించుకున్నాను కాని నా పెంపుడుతండ్రి నా తండ్రి పాపానికి ఆయన్ని నిందించా లన్నాడు ఆనాటినుంచి నా అసలు తండ్రిని శపించుకుంటూ కాలం గడుపుతున్నాను నే నేదైనా నేరంచేసిఉంటే అది నా తండ్రి నన్ను క్రూరంగా విడిచిపెట్టివేసినదానికే ఫలితం"

"మరి నీ తల్లి?"

"నా తల్లి నేను చనిపోయాననుకుంది ఆమెకీ పాపంలో పాలులేదు అందువల్ల ఆమె పేరు తెలుసుకోవాలనే కోరిక నాకు లేదు ఆమె యెవరో నాకు తెలియదు"

సరిగ్గా అప్పుడే న్యాయస్థానంలో ఒక మూలనుంచి ఒక స్త్రీ ఆర్తనాదం వినపడింది ఆమెను కొందరు సహాయంచేసి తీసుకుపోయారు ఆమెముసుగు జారిపోయింది యువకులందరూ హెర్మినా డాంగ్లర్‌ని గుర్తుపట్టారు విల్‌ఫర్ట్‌కి పరిస్థితి దుర్భరంగా ఉంది లేచి నిలబడి జుట్టు పీక్కోడం మొదలుపెట్టాడు అతనికి పిచ్చెత్తిందని అందరూ అనుకున్నారు

"నువ్వు చెప్తున్నదానికి నిదర్శన మేమిటి?"

"నిదర్శనం కావాలంటే విల్‌ఫర్ట్ ముఖంవంక చూడండి"

తరవాత బెనెడెట్టో విల్‌ఫర్ట్ నుద్దేశించి ఇలా అన్నాడు "నాన్నా! వారికి నిదర్శనం కావాలట మీరే చెప్పండి నిదర్శనం చూపమంటారా?"

విల్‌ఫర్ట్ తల అడ్డంగా తిప్పాడు "అక్కర్లేదు అదంతా వ్యర్థం" అన్నాడు తరవాత ప్రధాన న్యాయమూర్తివంక తిరిగి ఇలా అన్నాడు "నిదర్శనా లింక అనవసరం అతను చెప్పినదంతా అక్షరాలా నిజం నేను నేరస్థుణ్ని భగవంతుడే ఇంతకాలానికి నాకు శిక్ష విధిస్తున్నాడు నేను కేవలం భగవంతుని ఇచ్ఛకు శిరసా వహించడం తప్ప గత్యంతరం లేదు"

న్యాయస్థాన మంతటా దుర్భరమైన ప్రశాంతత అవరించింది

"ఇంక నాటకాలు అబద్ధాలని ఎవ రంటారో చెప్పండి" అన్నాడు బోశాంప్ మిత్రులతో

విచారణ వాయిదా వెయ్యబడింది విల్‌ఫర్ట్ వెంటనే లేచి జనాన్ని తోసుకుని వెళ్ళి బగ్గీలో కూలబడ్డాడు ప్రపంచమంతా బరువై తనపై విరిగిపడినట్లు విల్‌ఫర్ట్‌కి అనుభవమౌతోంది తన పతనాన్ని గురించి ఆలోచించ నారంభించాడు ఇంతలో అతనికి తన భార్య జ్ఞప్తికి వచ్చింది గుండెలో శూలం గుచ్చుకున్నట్లయింది అప్పుడే తానామెకు మరణ శిక్ష విధించి వచ్చాడు ఆమె ఈ పాటికి ఆత్మహత్యకు ఉపక్రమిస్తుందనుకున్నాడు తన పాపాలను విస్మరించి తనను క్షమించమని కోరుతూ ఆమె తనకు లేఖ వ్రాస్తూ ఉండవచ్చు క్షమార్పణకోసం ఆమె ప్రాణ త్యాగం చేస్తోంది ఆమె పాపాత్మురాలెందుకయింది? తన సాహచర్యం వల్లనేనని ఇప్పుడతనికి తోచింది ఆమె పాపాల కత్తి చూపడానికి తనకి సాహస మెక్కడినుంచి వచ్చింది? ఆమె చనిపోకూడదనుకున్నాడు ఆమెను రక్షించాలి తరవాత ఇద్దరూ కలిసి పారిస్ నుంచి పారిపోవాలి గతాన్నంతా మరిచిపోయి కొత్త జీవితం ప్రారంభించాలి ఎడ్వర్డ్‌ని ఈ విష పూరిత వాతావరణంనుంచి రక్షించాలి

ఇంటివద్ద బగ్గీ ఆగగానే విల్‌ఫర్ట్ ఒక్క ఉదుటున దూకి ఇల్లు ప్రవేశించాడు గబగబ భార్యగది వద్దకు వెళ్ళాడు భార్యను పేరు పెట్టి పిలిచాడు ఆమె పలకలేదు ఎడ్వర్డ్‌ని పేరుపెట్టి పిలిచాడు జవాబు లేదు తిరిగి భార్యను పిలిచాడు "ఎవరు?" అన్న సన్నని గొంతుక వినపడింది అది మూలుగువలె ఉంది "నేను, తలుపు తియ్యి త్వరగా" అన్నాడు విల్‌ఫర్ట్. కాని తలుపు తెరుచుకోలేదు విల్‌ఫర్ట్ తన్నపు గంటాడు లోగడియ లేదు కాబోలు ఇట్టే తెరుచుకుంది కుర్చీ పట్టుకుని నిలబడి హీలాయ్ మెల్లిగా వెనక్కి తిరిగింది పాలిపోయిన ఆమె ముఖం నల్లబడుతోంది "మీ ఆజ్ఞ శిరసా వహించాను ఇంకేం కావాలి?" అంది మాటలు నూతిలోనుంచి వినవస్తున్నట్లున్నాయి విల్‌ఫర్ట్ విభ్రాంతుడైనాడు ఆమె గభాలున నేలపై కూలిపోయింది హీలాయ్‌విల్‌ఫర్ట్ చనిపోయింది విల్‌ఫర్ట్ భీతితో కంపించిపోయాడు హఠాత్తుగా అతనికి కుమారుడు జ్ఞప్తికి వచ్చాడు "ఎడ్వర్డ్! ఎడ్వర్డ్!" అని పిలిచాడు జవాబు లేదు వెనుక గదిలోకి చూశాడు "ఎడ్వర్డ్! పారిపోదాం రా!" అని కేకపెట్టాడు జవాబు లేదు వెనుకగదిలో ఉన్నాడు కాబోలనుకున్నాడు ఆ గదికి వెళ్ళాలంటే భార్య శవాన్ని దాటి వెళ్ళాలి భార్య కన్నులు భయంకరంగా ఉన్నాయి విల్‌ఫర్ట్ కళ్ళు మూసుకుని శవాన్ని దాటాడు వెనుకగదిలో చూడగానే విల్‌ఫర్ట్ మనస్సు చెదిరిపోయింది గుడ్లు వెళ్ళబెట్టుకుని చూశాడు ఎడ్వర్డ్ సోఫాలో పడుకున్నాడు ఒక చెయ్యి నిరాధారంగా వేలాడుతోంది విల్‌ఫర్ట్‌కి మతి స్థిరం తప్పింది దెబ్బతిన్న పులి పిల్లను తల్లి చూసినట్లు ఎడ్వర్డ్‌ని చూస్తున్నాడు ఎత్తుకుని పేరెట్టి పిలవ నారంభించాడు జవాబు లేదు చేతులలో సత్తువ ఉడిగిపోయింది పసిబిడ్డ నేలకు జారిపడ్డాడు భీభత్సంగా జుట్టు పీక్కుంటూ గదిదాటి పరుగెత్తాడు వెదుక్కుంటూ తండ్రి గది ప్రవేశించాడు వయర్ కైర్ వద్ద ఫాదరీ బుసోనీ నిలబడి ఏదో చెప్తున్నాడు విల్‌ఫర్ట్ గుమ్మంలో నిలబడిపోయాడు "మీరా!" అన్నాడు "మీ రెప్పుడు కనపడినా నా యింటిలో మృత్యువు ప్రత్యక్షమౌతోంది మీ రెందుకొచ్చారు?"

బుసోనీ అతన్ని పరికించాడు న్యాయస్థానంలో పరాభవం పూర్తయిందని గ్రహించాడు "మీరు చేసినదానికింతవరకూ అనుభవించిన శిక్ష చాలునని చెప్పడానికి వచ్చాను మిమ్మల్ని ఇంక క్షమించి కాపాడమని భగవంతుని ప్రార్థిస్తున్నాను"

"ఆ! ఆ! కంఠస్వరం ఎవరిది? బుసోనీది కాదే!"

"కాదు" అన్నాడు బుసోనీ అంటూ మూడంచుల టోపీ తీసివేశాడు పైబురఖా విప్పివేశాడు.

"ఎవరు? కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో!" అన్నాడు విల్‌ఫర్ట్

"కాదు మీ రింకా దూరం ఆలోచించండి నే నెవరినో బోధపడుతుంది"

"ఆ కంఠస్వరం నే నెక్కడ విన్నాను?"

"మొదటిసారి మార్సెల్స్‌లో విన్నారు ఇరవై మూడేళ్ళ క్రిందట మీ మొదటిపెళ్ళి విందురోజున విన్నారు"

"మీరు బుసోనీ కాదా? మాంట్‌క్రిస్టో కూడా కాదా?

అయితే ఎవరు? నా ప్రచ్ఛన్న శత్రువా? మార్సెల్స్‌లో నేను మీకే మపకారం చేశాను?"

"మీరు నన్ను ఘోరయాతనలకు గురిచేశారు ఇఫ్‌కోటలో బంధించారు నా సౌఖ్యాన్ని నాశనంచేశారు నా ప్రియురాలిని వేరుచేశారు"

"ఎవరు మీరు? చెప్పండి ఆగండి గుర్తుకు వచ్చింది మీరు "

"ఎడ్మండ్ డాంటీ"

"ఎడ్మండ్ డాంటీ!" అన్నాడు విల్‌ఫర్ట్! తరవాత అతని చెయ్యి పట్టుకున్నాడు "ఎడ్మండ్ డాంటీ! నాపై పగ తీర్చుకోడానికి వచ్చారా? అయితే ఇటు రండి " గబగబ అతన్ని తనభార్య గదివద్దకు లాక్కువెళ్లాడు "అటు చూడండి మీ పగ తీరిందా?" అన్నాడు

మాంట్‌క్రిస్టో ముఖం పాలిపోయింది పగతీర్చుకోడాని కింత ఘోరఫలితం సంభవిస్తుం దనుకోలేదతను అతని నీ మారు భీతి ఆవహించింది తాను భగవత్కార్యం నిర్వర్తిస్తున్నానని ఇంక భావించడం అసంభవమనుకున్నాడు శవాన్ని దాటి ఎడ్వర్డ్‌ని సమీపించాడు కనురెప్ప తెరిచి చూశాడు నాడి పరిశీలించాడు ఇంకా నాడి ఆగిపోలేదు వెంటనే ఎడ్వర్డ్‌ని ఎత్తుకుని ముందులున గదివైపు పరుగెత్తాడు విల్‌ఫర్ట్ కలవరానికి మితి లేదు "అయ్యో! నా కొడుకు నెత్తుకుపోతున్నాగు, శవాన్ని కూడా తీసుకుపోతున్నాడు!" అని బిగ్గరగా అరిచాగు మాంట్‌క్రిస్టోని తరమాలని పరిగెత్తాగు కాని హఠాత్తుగా మేడ మెట్లవద్ద ఆగిపోయాడు కల చూస్తున్నట్లుగా మెట్లవంక చూస్తూ నిలబడిపోయాడు అతని దృష్టి మెట్లపై లేదు ఏ వస్తువుపైనా లేగు ఎక్కడో అతి దూరాన కలదృశ్యాన్ని చూస్తున్నట్లుండిపోయాగు కనురెప్పలు మూతపడలేగు గుళ్లు పెద్దవైనాయి ఛాతీ చీల్చుకుంటున్నట్లు గోళ్లతో గీరుకో నారంభించాగు వేళ్ల మధ్య రక్తం చిందింది కణతలపై నరా లుబ్బినాయి తలలో అగ్నిశిఖలు లేచినట్లుంది మతి స్థిమితం తప్పింది

పావుగంటతరవాత మాంట్‌క్రిస్టో ఎడ్వర్డ్‌ని ఎత్తుకుని వచ్చాడు ఎంత ప్రయత్నించినా బాలుని ప్రాణం రక్షించలేకపోయాడు తల్లి శవంవద్దకు తీసుకువెళ్ళి జాగ్రత్తగా బిడ్డశవాన్ని ప్రక్కనే పరుండబెట్టాడు అక్కడే మోకరిల్లి భగవంతుని ప్రార్థించాడు మెల్లిగా లేచివచ్చి మేడ దిగాడు అతని తల వాలిపోయింది చేతులు నిస్సత్తువగా వేలాడుతున్నాయి పరిచారకులను పిలిచాడు "విల్‌ఫర్ట్ ఎక్కడ?" అని అడిగాడు పరిచారకులు జవా బివ్వడానికి బదులు తోటవంక సంజ్ఞచేసి చూపారు మాంట్‌క్రిస్టో తోటలో చూశాడు అక్కడ చేత పలుగు పుచ్చుకుని విల్‌ఫర్ట్ నేల తవ్వడం గమనించాడు చుట్టూ పరిచారకులు నిలబడ్డారు మాంట్‌క్రిస్టో అతన్ని సమీపించాడు "ఇక్కడ కాదు, అక్కడ" అంటున్నాడు విల్‌ఫర్ట్ రెండడుగులు ముందుకు వెళ్లి మళ్లీ నేల తవ్వ నారంభించాడు మాంట్‌క్రిస్టో అతని భుజంపైన చెయ్యి వేశాడు "పాపం! ఎడ్వర్డ్ కూడా " విల్‌ఫర్ట్ ఇంక అతన్ని చెప్పనివ్వలేదు అసలు అతని మాటలు వినలేదు "దొరుకుతాడులెండి ఇక్కడ లేడేమో! ఆ చెట్టుకిందే ఉంటాడు లెండి నేను తవ్వి చూస్తాగా? తోటంతా తవ్వేనాసరే ఎక్కడున్నాడో పట్టుకు తీరతాను" అంటున్నాడు విల్‌ఫర్ట్ మాంట్‌క్రిస్టో భీతితో ఒకడుగు వెనక్కు వేశాగు "ఆ! పిచ్చెత్తింది!" అన్నాడు తాను చేసిన ప్రతీకారం ఉచితంకాదని శంకించ నారంభించాడు "అబ్బ! ఇది చాలు ఇంక ఉన్నవాడినైనా రక్షించాలి" అనుకున్నాడు వెనతిరిగి ఇంటివంక చూశాగు ఇల్లంతా విరిగి మీదపడుతుందని భ్రాంతిపడ్డాడు భీతితో ఇల్లు విడిచి పరుగెత్త నారంభించాడు తన యిల్లు చేరకోగానే అక్కడ మాక్సిమిలియన్ మారెల్ కనపడ్డాడు "మారెల్! సిద్ధంగా ఉండు రేపే బయలుదేరి పోదాం!" అన్నాడు.

## 90

మార్సెర్ఫ్, డాంగ్లర్, విల్‌ఫర్ట్ కుటుంబాలలో సంభవించిన దుర్ఘటనలు పారిస్ నగరంలో విశేషంగా చర్చించబడుతున్నాయి జూలీ భర్తతో ఇలా అంది "ఇమాన్యూల్! ఇదంతా విచిత్రంగా లేదూ? నిన్నటివరకూ భాగ్యసంపదలతో తులతూగుతూ, సర్వసుఖాలు అనుభవించినవారు ఒక్కసారిగా ఏదో అతీతశక్తివాతబడి సర్వం కోలుపోయినారంటే, అర్థమేమిటి? తమ తప్పిదాలను కానలేకపోయినారన్న మాట "

"ఎవరి చేతలకు తగినట్లు వారిని భగవంతుడు రక్షించి శిక్షిస్తాడు " అన్నాడు ఇమాన్యూల్ మాక్సిమిలియన్ కూడా అక్కడే ఉన్నాడు కాని ఇది అతని చెవి కెక్కడం లేదు నైరాశ్యంలో మునిగి ఎప్పుడూ పరధ్యానంతో గడుపుతున్నాడు

"అలాఅనకూడదు ఇమాన్యూల్" అంది జూలీ "మనకీ కష్టాలు రాలేదా? నా తండ్రి ఒకసారి హత్య చేసుకోడానికి ప్రయత్నించ లేదా?"

"నిజమే కాని ఆఖరుక్షణంలో ఒక దూతను పంపి భగవంతుడు నీ తండ్రిని కాపాడాడు "

సరిగ్గా ఆ సమయంలోనే మాంట్‌క్రిస్టో ఇంటిలోకి అడుగు పెట్టాడు దంపతులిద్దరూ ఆశ్చర్యపడ్డారు మాంట్‌క్రిస్టో వారి వంకనైనా చూడకుండా మాక్సిమిలియన్‌తో "మారెల్! నీ కోసం వచ్చాను" అన్నాడు

"నేను సిద్ధమే" అన్నాడు మాక్సిమిలియన్

"అదేమిటి?" అంది జూలీ

"అవును మేమింక వెళ్లిపోవాలి అయిదు రోజుల్లో రోమ్ నగరం చేరుకోవాలి వెంటనే బయలుదేరు మారెల్" అన్నాడు మాంట్‌క్రిస్టో

"ఇదేమిటి? ఇంత అకస్మాత్తుగా, మాతో ముందైనా చెప్పకుండా ప్రయాణమౌతున్నారెందుకు? మా అన్న కూడా రోమ్ నగరం మీ వెంట వెడతాడా?"

"అవును" అన్నాడు మాక్సిమిలియన్ "మాంట్‌క్రిస్టో నన్నెక్కడికి తీసుకువెడితే అక్కడికి వెడతాను కొన్నాళ్లపాటు ఆయనవెంట తిరుగుతాను "

"మాక్సిమిలియన్ నా వెంట ఉంటాడు జూలీ! నువ్వు బెంగ పెట్టుకోనవసరం లేదు "

"బెంగ పెట్టుకోను కాని మళ్లీ మీ దర్శనం ఎప్పుడో?"

"ఏమో! వ న్నింక నువ్వు చూడలేవేమో" అన్నాడు మాంట్‌క్రిస్టో

జూలీముఖం వివర్ణమయింది మాంట్‌క్రిస్టో ఆమెను సమీపించి చేతులందుకున్నాడు ఆమె కన్నులలో నీరు నిండింది

మాక్సిమిలియన్ మాంట్‌క్రిస్టో వెంట నడిచాడు ఇద్దరూ బగ్గీ ఎక్కగానే ఆలీ వచ్చి ద్వారం వద్ద నిలబడ్డాడు "నయర్ టైర్ ఏమన్నారు?" అన్నాడు మాంట్‌క్రిస్టో జవాబుగా ఆలీ కన్నులు మూసుకున్నాడు "అయితే ఒప్పుకున్నాడన్నమాట సరే బగ్గీ పోనియ్యి "

అరగంటలో బగ్గీ నగరం దాటింది మాంట్‌క్రిస్టో వెనుక నగరంపైన దృష్టి నిలిపాడు "మహానగరం" అనుకున్నాగు మాంట్‌క్రిస్టో తనలో "నేనీనగరం వచ్చి ఆరు మాసాలు కాలేదు భగవం

(37-వ పేజీ చూడండి)



## శ్రీ పోలవరపు శ్రీహరిరావు

సమయం : రాత్రి 8 గం॥నుంచి 12 గం॥ వరకు

(ప్రారంభ దృశ్యం గూళ్ళలోని అను దపు దీపాలు మసగవెలుతురు నిస్తున్నయ్ గగులలో గుడ్డి హరికేన్ లాంతర్లు వెలుగు తున్నయ్ కుడివైపునగల అరుగుమీద ఒక గంపదీపం వెలుగుతూంది దాని కెదురుగా స్తంభాన్నానుకుని బైరాగితాత తంబురా సవరించుకుంటున్నాడు ఆ వెనుక పంచ గోడ నానుకుని గురుమూర్తి కునుకు తున్నాడు రంగానికి కుడిమూలగావున్న ముల్లి ముగ్గిచాటునుంచి అరీఅరని పొయ్యి పొగ వదులుతూంది సత్రపు నడు నెత్తి మీద "రత్నమాంబా ధర్మసత్రం" అనే బోర్డు జీర్ణదశలో వుంది ఎగురుగాగల సింహద్వారం మీద గవ్వళ్ళపటాలు కొయ్యలో చెక్కివున్నాయ్

ధ్వనులు బైరాగి తాత తంబుర శ్రుతి చేసుకుంటున్నదీ, గదులలో గుసగుసలూ, వంటసామగ్రి కదలికలూ

సంగీతం మధ్యమస్థాయిలో ప్రారంభమై, బాగా పైకిపోయి గందరగోళంచేసి —మంద్రస్థాయికి దిగుతుంది

బైరాగి [గొంతు సవరించుకుని] ఓం పరాత్పర సద్గురు పరబ్రహ్మణేనమః

తత్త్వం

ఇది వినుమన్నా-ఇది తెలుసుకోరన్నా॥
ఇది లోకంబన్నా-మనలోకంబన్నా॥
లోకంబన్నది సత్రమురన్నా
లోకంపోకడ తెలుసుకోరన్నా॥
॥వినుమన్నా॥
ఇది వినుమన్నా-ఇది తెలుసుకోరన్నా॥
ఇది రంగస్థలమన్నా-
మన నాటకస్థలమన్నా॥
మానవులంతా బొమ్మలురన్నా
ఆడుకుపోయే బొమ్మలురన్నా॥
॥వినుమన్నా॥

గురుమూర్తి [విసుగ్గా కళ్లు తెరచి] వినీవినీ చెవులు దిబ్బళ్ళెత్తన్నాయ్‌గానీ యికూరకో బాబూ—నీకు పుణ్యముంటుందీ

[ఇద్దరు రోగులువచ్చి అరుగుపంచను పడుకున్నారు]

బైరాగి అవును బాబూ! గుడ్డివాడి కద్దం చూపడం—పాపంగానే కనపడు తుంది!! ఏం లాభం?

గురుమూర్తి [ఈసడింపుగా] అర్థం పర్థం లేకండా పనసలు వల్లిస్తే అక్కడికి నువ్వేదో గొప్పోడివైపోయినట్టూ!

బైరాగి అవును బాబూ! అర్థం తెలిస్తే యిగా ఎందుకుంటాం? అర్థం తెలుసుకోమంటేనే కోపమయ్యె!!

గురుమూర్తి ఓయబ్బ! నీకేమా [మహో] తెలుసు లేవయ్యా, అర్థాలూ శాపనార్థాలూను ఈ డంబాచారాలకేంగానీ కాస్త నిద్రపోనిద్దూ

బైరాగి అవును! అంతా డంబాచారమే!! అసలు మన బదుకులే నిద్రతో నింపుకుంటున్నాంగదా—యిక కర్మార్థం దేవుళ్ళు చెప్పడో నాయనా?!

గురు ఇదుగో, నా కా వేదాంతపు గొడవలెందుకు తాతా? పగలల్లా పొట్టకోసం తిరిగి తిరిగి, చచ్చి చెడి వచ్చి, కాస్త నిద్రోదామని నా గోడయితేనూ [జాలిగా]

బైరాగి చ్చ్ జానెడు పొట్టతోనే బదుకంతా తెల్లవారుతుంది—పొద్దుగూకేనే నిద్రపెద్దమ్మ పూనుతుంది

గురు [కోపంగా] కాక, తెల్లవార్లూ నీతో జాగారంచేస్తే పగలు వాడా, పల్లె తిరిగే దెట్టాగూ అంట?

బైరాగి• అవున్నాయనా—అవును. [జాలిగా నవ్వి] హుం కళ్లున్నా కబోది పక్షులమే నీ కంత శ్రమ ఎందుకివ్వాలి గానీ, కుండకో [తంబురా ప్రక్కను పెట్టబోతున్నాడు]

బంగారయ్య [లోపలి గదిలోంచి దుట్టతాగుతూ వచ్చి వీపందగ్గర కూచున్నాడు] బైరాగ్, మా నేశావేం? నీ పాట విందామని నేనొస్తేనూ?

బైరాగి ఆ చిన్నవాడికి నా పాట గోలగా వుందటబాబూ

బంగా నీ పాట అంత కమ్మగా వుంటుందే—గోలేమిటె? అయినా సందకాడే నిద్రేమిటె?

గురు [కోపంగా లేచి) మీకేం జరుగుబాటుం డే వాళ్లు—రాత్రుళ్లు మేలుకున్నా, పగలంతా నిద్రపొమ్మ పగలంతా గడపగడపకీ తిరిగితేనేగాని మా పొట్ట నిండదయ్యో

బంగా ఇంతకంటే ఎక్కువ పనిగాళ్లమే చేమూను అయినా, దరిద్రమొచ్చిపోలకి, నిద్రపెద్దమ్మోరు ఓలిస్తే పలుకుతుందిలే!!

గురు ఏమండోయ్—!—ఏదో పెట్టి పోషిస్తాండట్టు మాట లొదిలేస్తున్నారే?

బంగా [తుపుక్కున వుమ్మేసి] ఓయబ్బ! ఎంత రోషమంటేనూ? ఎవరూ పెట్టకుండానే యీ కాషాయగుడ్డల్లో బదుకుతున్నావు కామోసు?

గురు అయినా, యిష్టముంటే యింత పెట్టాలి, లేకపోతే పొమ్మనాలిగాని—మమ్మల్ని తిడతానికి నువ్వెవరవయ్యా?

బంగా అదుగో ఆమాటిను తాతా! ఇపుడు నేనేం తిట్టానని?

బైరాగి ఎవరు ఎవర్ని తిట్టినా ఫరవా లేదు, తిట్టడంలో ప్రయోజకత్వం అంతకన్నా లేదు!!

గురు [విసుగ్గా] హుం నీబోటి చొల్లు కబుర్లు చెప్పేవాళ్లుండబట్టే మన గోసాయి

లంటే విలువలేకుండా పోయింది

[కునుకు ప్రారంభిస్తాడు]

బైరాగి • అవును బాబూ! అల్పజ్ఞానంతోనూ, పొట్టకోసమూ విరాగులయిన వాళ్ళ వల్లకాదు—మన కగౌరవం కలిగేది!

బంగా మా బాగా అంటిచ్చావు తాతా! ఇంకా నీబోటి నిజమైన సాధువులుండబట్టిగానీ, లేకపోతే యీ రోజుల్లో కాషాయబట్టలకు విలువేమిటీ?

బైరాగి కాదుబాబూ! ఈ అనంతమైన ప్రపంచంలో ఏ అంటూ చేరుకోలేని బాటసారులం—మనకు విలువలేమిటీ? లోచూపు కావాలిగాని, పైబట్టలూ, ఆభరణాలూనా మానవుల విలువల్ని తూచేవి?

బంగా [వెగటుగా ముఖంపెట్టి] నువ్వేదో వేదాంతం మాట్లాడుతున్నావుగాని—ఒక్క పాటపాడుదూ! చుట్టయిపోతే పోయి పడుకుంటాను

బైరాగి నా పాటవింటే మాత్రం మీకేం లాభంబాబూ?

బంగా చక్కగా పొద్దోతుంది నీ కంఠం, శృతీ భలే హాయిగా వుంటయ్యిలే!!

బైరాగి మ్చ్! అంతేలెండి!! సంగీతం తప్ప, మాటలు వినడం మీ కలాటులేదు ఊఁ [నిస్పృహ]

బంగా [తుపుక్కున వుూశి] ఒక్క తత్వం వినిపిద్దూ పొద్దున్నే చిల్లరమార్చి రాగిడబ్బిస్తానులే!

బైరాగి [ఎగతాళిగా] ఎంత దయా?

గురు [తటాలున లేచి] ఒక్క చుట్టముక్క పారేస్తే - నేను ఘటవాయిద్యం వంతగలుపుతాను బాబూ - మా పసందుగా వుంటుందిలెండి!! [ప్రక్కనున్న కుండతీసి దరు వేస్తాడు]

బైరాగి మావాడు దరువులు నేర్చినవాడు లెండి

బంగా: సరే, కానివ్వండి [బొడ్లోనుంచి పుగాకుతీసి, పాయలో సగం తుంపి గురుమూర్తి కిస్తాడు]

గురు [పాయ అందుకుని బొడ్లోదోపి, దరువు వేస్తూ] ఊఁ, శృతిజెయ్యి తాతా!!

బైరాగి అంత వుబలాటం ఎందుకో?

• [తంబురాతీసి శృతిజేసి పాడతాడు]

ఇది వినుమన్నా - ఇది తెలుసుకోరన్నా॥
ఇది వేషంబన్నా - ఇది మోసంబన్నా॥

వేషం మెరుగులు మోసమురన్నా
బ్రదుకు బూటకం చేయకురన్నా॥
॥వినుమన్నా॥

ఇది వినుమన్నా-ఇది తెలుసుకోరన్నా॥
ఇట పుట్టితిమన్నా-ఇక గిట్టుదుమన్నా॥
పుట్టేగిట్టే లోపలరన్నా
పుట్టుక సఫలం జేసుకోరన్నా॥
॥వినుమన్నా॥

వెంకటరావు [చెరిగిన జుట్టు, నలగని సూటు, సిగరెట్‌లతో వచ్చి ఎడమవైపు అరుగు కొసను కూచ్చున్నాడు]

గంగన్న [లోపలి హాలులోంచి, లాంతరుతో ప్రవేశించి, వెంకటరావును చూచి, ఆశ్చర్యంగా] ఎవరండీ మీరూ?

వెంకట [తడబడుతూ] *Myself*? . నేనా?

గంగన్న మిమ్మల్నే - అడుగుతా!

వెంకట మా దీవూరు కాదు లెండి

గంగన్న అహఁ! ఎక్కడో చూచినట్టుంటేనూ?

వెంకట [సిగ్గుగా] *Me*? నన్నే?

గురు [ఈల వేస్తాడు]

గంగన్న అవునయ్యా ఆ పక్క వీధిలో—

వెంకట [లేచి, దగ్గరకువెళ్ళి] ఇలా రండి - ఒక్కమాట [ఇద్దరూ లోనికి రెండడుగులు వేసి గుసగుస లాడారు]

వెంకట [నెమ్మదిగా బతిమాలుతూ] నా పరువు ఎవరికీ చెప్పరు కదూ?

గంగన్న అబ్బే! నా కెందుకూ? చెప్పనంటే చెప్పనుగా! [ఇద్దరూ వచ్చి తమతమ స్థానాల్లో కూచున్నారు]

గంగన్న ఏం గురుమూర్తీ! ఇవ్వాళేదో హుషారుగా వుందే?

గురు [ముఖం ముడుచుకుని] ఏమీ లేదు బాబూ! బంగారయ్య గోరు వాయించమంటేనూ [ఘటం చూపుతాడు]

గంగన్న మరి, మన సంగతేంజేశావ్?

బైరాగి లావాదేవీలు వదలవుగదా! ఎం తివ్వాలిబాబూ?

గంగన్న ఎంత గాకేం—రెండుసెల్లు దివ్వాలి—మాటలా మరీ?

బైరాగి రెండు రోజుల్లో యిచ్చుకుంటానుబాబూ!

గంగ ఇలాటి వాయిదాలు చాలా కూశాంగానీ, యిక మర్యాదక్కడు రేపట్నుంచీ మరోపంచ చూచుకో—

బైరాగి ఈ వూళ్ళో యింకోపంచ ఏముంది పంతులుగారూ? సర్కారు శిస్తులాగా—మీరూ అంత రొక్కాయిస్తే, మా బోటివాళ్ళు తలదాచుకునే దెలాగు?

వెంకట ధర్మసత్రంలో పన్నులేమిటీ?

బంగారయ్య అదేమన్నమాట! ఎవరి మామూళ్ళు వారికుండవలసిందే ఆ గంగన్న పంతులుమాత్రం దీన్ని నమ్ముకున్నవాడు—అతను బదికే దెలాగు?

గంగన్న మా రాజులు, మంచిమాటన్నారు దోవేపోయేవాళ్ళందరికీ, వేళా పాళా చూడకుండా; యింత వసతి కలిగిస్తూంటే—పావలా, అర్ధా యిచ్చేందుకు యిన్ని లాలు దీస్తారెందుకో—పెద్దమనుషులు?

వెంకట • లేదు లెండి . . తెలియక చేశాను ఎక్స్యూజ్ మీ?

బైరాగి రేపు గురుమూర్తి కూడా కలిసి నేనే యిస్తానులెండి—పంతులుగారూ

గంగన్న సరే! నువ్వొప్పుకున్నావు గనక్గా నీ వాడి నీరోజే గంటేశేవాణ్ణి [లేచి] వెళ్ళొస్తా బంగారయ్ గారూ.

బంగా మరి, మా మాటేమంటారూ?

గంగన్న మీరంతగా అడిగితే కాదనలేకపోతున్నాను మీ రెంతకాలమున్నా నాకేమీ అభ్యంతరంలేదు గానీ, అమ్మగారు "పావుకార్లకు సత్రాలేం గతీ" అని గోల



చేశారు ఆమెకు శతవిధాలా చెప్పి వొప్పించేసరికి నా తలప్రాణం తోకకొచ్చిందంటే నమ్మండి ఏదో, పిల్లలుగలవాణ్ణి-మీ దయ

బంగా దానికేం లేవయ్యా! వెళ్లేటప్పుడేదో ముట్టజెబుతాంలే! ! పొద్దుపోతూంది పోయిరా

గంగన్న శలవ్ [వెళుతూ] వెళ్లొస్తా నల్లుడుగారూ [వెళ్లిపోతాడు]

బంగా అల్లుడుగారంటూ వేమిటి? ఇందులో అల్లుడెవరూ?

గురు [వెంకట్రావును చూపి] అరుగో వారే గావల్ను ఆ! ఎక్కడో చూశినట్టే గురుతు

వెంక [బిత్తరపోయి, సంబాళించుకుని] నన్నెవరూ చూడలేదు లెండి నా మనసేమీ బాగుండలేదు నా సంగతొదిలి—మీ గొడవ మీరు పడుదురూ [సిగరెట్ తీసి వెలిగిస్తాడు]

గురుమూర్తి [లేచి దగ్గరకువెళ్ళి] చలి ఎముకలు కొరికేస్తోంది ఒక్క సిగరెట్టిప్పిద్దురూ!

వెంకట్ [జేబులు తడిమి] అరె! అయిపోయాయే?! డబ్బిస్తాను - దగ్గర్లో దొరుకుతాయేమో, తెస్తావా?

గురు ఓ ఆల్‌రైట్‌గా [చెయి జాపాడు]

వెంకట్ [రూపాయి తీసి యిచ్చి] చిల్లర లేదు త్వరగారా?

గురు ఒక్క నిమిట్‌లో [పరుగెత్తాడు]

వెంకట్ [అటూ యిటూ చూచి-కాళ్లతో భూమినితన్ని] ఛీ! ఈసత్రంలో-చాపన్నా లేనట్టుంది ఛీ

బైరాగి సత్రంమీద కోపిస్తే లాభమేమిటి బాబూ? ఇక్కడ ఎవరి వసతులు వారు కల్పించుకుని, పొద్దుపుచ్చుకు పోవలసిందే!

బంగా కాక, యిదేమన్నా అత్తారిల్లా-పట్టుపాన్పు ల్లేవని అలిగేందుకూ?

బైరాగి ఎగతాళికైనా బంగారంలాంటి నిజం పలికారు!

వెంకట స్టుపిడ్స్ హీనుల కెప్పుడూ హీనపుకోర్కెలూ, హీనపు హాస్యాలే. [కోపం] ఛీ!—

బైరాగి ఎవరు హీనులో ఎవరికి తెలుసు బాబూ!

బంగా ఏదో సంతానస్వాములవారి దర్శనంకోసం యీవూరొచ్చి, యీ సత్రంలో వుంటున్నాంగానీ, మేమేమంత లేనివాళ్లం గాదులే మా మేడమీద మీబోటివాళ్లు వందమంది పడుకో వచ్చు పరాయిచోట ఏ వంచో పట్టుకు జరుపుకు పోవాలిగానీ, అత్తారింటి అల్లుళ్ళలా అలిగితే ఏం లాభం??

వెంక [కోపంగా] మాటిమాటికీ "అలిగానూ, అలిగా" నంటున్నారు, ఆ మామగాడితో ఎడ్జెస్టుగావడం ఎంత కష్టమో మీకేం తెలుసు? అంతంతమాత్రపు వాణ్ణయితే పీపుకు తాటాకులు కట్టిపంపేవాడే—నేను గనక ఏదో పరువు నిలబెట్టుకొస్తున్నాను

బంగా అలాగా! పరువుకోసం అలిగినా ఫర్వాలేదులెండి [లేచి వెంకట్రావు దగ్గరలో కూచ్చుంటాడు]

బుచ్చిబాబు [చిరిగిన గుడ్డలు, మాసిన గడ్డం, రేగినజుట్టుతో నెమ్మదిగా వచ్చి కుడిగోడమూల నానుకు కూచున్నాడు]

బైరాగి అలక కూడా ఆయుధమే!

బంగా! అయితేబాబూ; యింతకీ, మీ మామగారేమంటూ వేమిటి?

వెంకట ఏమన్నా అంటే నేనూరుకుంటానా? నా చాటునే—"ఉద్యోగం లేకండా గోళ్లు గిల్లుకుంటూ కూచున్నా"-నంటున్నాడట! వెధవకూతలూ, వాడూను!!

బంగా అందులో తప్పేమిటీ? "ఉద్యోగం పురుషలక్షణం" అన్నారుగా పెద్దలూ?

బైరాగి ప్రతీ వ్యాపకమూ ఉద్యోగంలోనే జమ!

వెంకట ఉద్యోగం వస్తే వద్దన్నానా? ట్రిపుల్ ఎం ఏ నని ఎన్ని అర్జీలు పెట్టుకున్నా ఒక్కరూ వుద్యోగం యివ్వ



తయ్యో [సిగరెట్ అరుగుకిందికి పారే
సాడు]

బంగా [చుట్టపారవేసి, తుపుక్కున ఉమ్మి] పోనీ—ఏ షావుకారు గుమాస్తాగా నన్నా—

వెంకట : *How mean!..* గుమాస్తా పనా? ఇంత బదుకూ బదికి—ముష్టి స్లేవిష్ వుద్యోగం చెయ్యమంటారటండీ?

బుచ్చి ఈ రోజుల్లో ప్రతీ వుద్యోగమూ బానిసపనే!

వెంకట అయినా, నా చదువుకు తగ్గ హోదా అన్నా వుండాలా, లేదా??

బుచ్చి ఈ రోజుల్లో ఎవరి విలువల్ని ఎవరు పాటిస్తున్నారూ?

బైరాగి బంగారమూ యినుమూ ఒకటే ధర పలుకుతుందన్నాడు బ్రహ్మంగారు!

బంగా అవును గానీ, నీ పేరేమిటో? [వెంకట్రావుతో]

వెంకట్రావు G N S వెంకట్ మిత్రులు జీనియస్ వెంకట్ అనేవారు బంధువులు వెంకట్రా వంటారులెండి

బంగా ఈ రోజుల్లో పేరులు కూడా ఫేషన్లు మార్చుకుంటున్నాయి సుమండీ!

బుచ్చి దాని ఖర్చేముంది గనక!

బంగా ఇంతకీ—యిలా ఏదో పెద్ద ఉద్యోగంకోసం బిగుసుక్కూచుంటే ఎట్లాగయ్యా! ఏదో ఒకటి వుద్యోగ మంటూ చేస్తూంటే - మీ మామగారు నోరుమెదిపే సావకాశం లేకుండా పొయ్యేదిగదా? పరువుకోసమైనా—

వెంకట దానికేం? చేతనయితే స్వగౌరవాన్నెలాగయినా నిలబెట్టుకోవచ్చు పాటపాడిస్తే అక్షరం ముక్కరాని ఆ మామగాడికోసం, గుమాస్తాపనికి దిగి నన్ను నేను హీనపర్చుకోలేను సుమండీ!

బైరాగి పరాన్నభుక్తంకంటే హీనమున్నదా బాయనా?

వెంకట పరాన్నమేమిటి, నాన్సెన్స్! —నా కట్నండబ్బు నా కిట్లా పారెయ్‌మనండి, ఆ గుమ్మం ఛస్తే తొక్కను

బంగా [హుషారుగా] అదా సంగతి?! అట్లా చెప్పవేం!! కట్నం డబ్బూ యివ్వక మాటలూ అంటూంటే - ఏ అల్లుడూరుకుంటాడయ్యా యీ రోజుల్లో? ఆ మామగాడికి నేనయితే యింత గడ్డి పెడుదును

వెంకట *Thanks* మీరే అందుకు తగ్గవాళ్లు ఆ వ్యవహారంలో కాస్త హెల్ప్ చేద్దురూ?

బంగా ఇంతకీ, ఆయ నెవరో—

వెంకట: ఆ పడమటివీధిలో అద్దాలమేడ లేదూ!

బైరాగి : ? ఖా కు ? ం' లక్ష్మయ్యగారి అల్లుడా మీరూ?

వెంకట ఎస్! దట్స్ ఇట్!!

బంగా నేనేదో వ్యాపారంలోవుండి, పదుగురితోనూ మెలిగేవాణ్ణి గనక ఫరవాలేదు గానీ - ఆ బైరాగితో కూడా యింగిలీషేనా?

వెంకట సారీ అదో అలవాటులెండి [బతిమాలుచూ] మరీ మీరు నాకీ సాయంచెయ్యక తప్పదు మీ మేలుకు తగ్గదేదో యిచ్చుకోగలను

బంగా ఓ అట్లాగేలెండి కిందే కూర్చున్నారు, చాపన్నా తెస్తానుండండి [లోనికి వెళ్లాడు]

బుచ్చి ఈహీహీహీ! అహ్హాహ్హాహ్హా!! [[illegible]]

[[illegible]]

వెంకట [కోపంగా] [illegible].

బుచ్చి [కటువుగా] ఏయ్! ఏమిటా మాట?

వెంకట [భయంపడి, తెప్పరిల్లి] *Oh! Sorry!!* నిన్ను కాదు సిగరెట్లకోసం రూపాయి పట్టుకెళ్ళిన గోసాయిగా డింకా రాకపోతేనూ—వాణ్ణి!!

బుచ్చి [నవ్వుకుంటూ గోడనానుకున్నాడు]

బంగారయ్య [చాప తెచ్చి వేసి కూచుంటూ, వెంకట్రావునుకూడా కూచోమని సైగచేస్తూ] వా డెక్కడికో వుడాయించే వుంటాడు—బిళ్ళకుడుంలాంటి రూపాయితో

వెంకట అంతే కావచ్చు! ఈదొంగ ముండా వాళ్ళందరికీ యీ కాషాయగుడ్డల వేషా లొకటీ!!



బైరాగి: ఇందులో వేషగాళ్లు కాని దెవరు—పరాత్పరా!

[ఇంతవరకూ మంద్రంగా మీటుతున్న తంబురను మూల మూటలవద్ద పెట్టి పంచను పడుకున్నాడు]

వెంకట ఇతడో పెద్ద వేదాంతి కబుర్లూ! [ఈసడింపు] సందర్భం తెలీని వాగుడు రూపాయీ పోయింది; సిగరెట్లూ లేవని నా వర్రీ!

బంగా కష్టపడి సంపాయించేవాళ్లకు తెలుస్తుంది గానీ—డబ్బు విలువ వాళ్లకేం తెలుస్తుందీ?!

వెంకట్ [జేబులు దులుపుకుని విసుగ్గా] అనో డన్నా!

బంగా ఏమిటదీ?

వెంకట ఇంకెవరూ, పెళ్లాం! [వెగటుగా] పల్లెటూరి బ్రూటు వాళ్ల నాన్న తాళపుచెవులన్నీ తనకే యిస్తాడు గదా, బైటికొస్తున్నప్పుడు మరో పది రూపాయలు వెయ్యకూడదూ జేబులో?!

బుచ్చి ఆ రూపాయీ ఆమెగారే-?!-[నవ్వు]

వెంకట హీనులకు హీనపు అంచనాతే ఆఫ్టరాల్ ఒక్క రూపాయి ఎట్లా చాలుతుం దనుకుందో, డన్స్!!

బుచ్చి పాపం! అమాయకురాలు—

వెంకట అదైనా బాగానే వుండును మళ్ళా తెలివితేటలు గంపెడూ! ఆతాళాలిట్లా గివ్వవే, మనకట్నం సొమ్మన్నా తీసుకుపోయి మద్రాసులో కాపురం పెడదామంటే—"అమ్మో మప్ఫయ్ వేలూ మూన్నాళ్లకే, మంచినీళ్ళలా మాయం జేస్తారు"అంటుంది

బుచ్చి ఓహ్హో, హోహోహో!!!! (వెకిలినవ్వు)

బంగా మీరు మహాకర్చుదారులు గావల్నూ!—అయితే, అసలు సంగతి అడుగుదామని మర్చేపొయ్యానూ! అకట్నం డబ్బు తింటూ కూచ్చుంటే ఎట్లా గడుస్తుందీ? మద్రాసులో ఏదైనా వ్యాపారం—

వెంకట: ఎందుకూ? మద్రాసులో ఏదో ఒక వుద్యోగం దొరకదటండీ! మనలాటి ట్రిపుల్ గ్రేడ్యుయేట్లు దొరికితే కాళ్ళుపట్టుకుని వుద్యోగమిచ్చే రోజులొస్తున్నాయ్‌లెండి

బంగా ఆఁ, మీ భ్రమగానీ—యింత కాలమూ దొరకనివుద్యోగం యిపుడు దొరుకుతుందా?—ఎంతో అనుభవంగలవాణ్ణి, నామాట వినీ, ఏదో వ్యాపారంలో దిగండి అసలు అలానే వుంటుంది లాభాలతో మీరింత తిని, పదిమందికి పెట్టొచ్చు మీకు కోరినన్ని నూట్లూ—మీ ఆవిడకి మెడనిండా నగలూ—

వెంకట దాని నగలకేం గానీ, మనం ఒక్క కారన్నా మెయిన్టెయిన్ చెయ్యాలి—, ఎంతకాలం ఈకాలినడక?

బంగా అలాగే—తప్పకుండానూ!! మరి, ఆ ముప్ఫయి వేలూ యిట్లాయిచ్చేస్తే, అణాకి పావలా లాభంవచ్చే వ్యాపారం చేయిస్తాను ఆరునెలల్లో కారు కొనియివ్వొచ్చన్నమాటే!

(దూరాన నక్కల అరుపులు బుచ్చిబాబు నవ్వులు)

వెంకట అదంతా మీదయ! (జాలిగా) మరి, ఆమామగాడి వ్యవహారం—

బంగా అదంతా నే సరిజేస్తాగా! భార్య మనపక్షమే గదా?

వెంకట మనమంటే పడిచస్తుంది, పొద్దస్నే లేవగానే పాదాలకు పూజ చేస్తుంది!!

బంగా ఇంకేం! [చిటికెలు వేసి] మూడు నెలల్లో మీకు కారు కొనిచ్చానన్నమాటే—

వెంకట: *Thanks alot*

బుచ్చి మూడు మాటల్లో ముప్ఫై వేల వ్యాపారం! [నవ్వు] బాగుంది—బంగారయ్యగారూ, బాగుంది! [వెకిలినవ్వు]

బంగా [కోపంగా] ఏమిటయ్యో అబ్బాయ్! ఇందులో నాకేదో ఒరుగుతుం దనుకుంటున్నా వనుకుంటానే!-ఒకళ్ళది సున్నపాకు తొడెం కూడా నాకక్కర్లేదు ఛీ-ఛీ-అలాటిది మాయింటా వంటా కూడా లేదు: నాకే బోలెడంత, తినేవాళ్ళు లేక మూలుగుతూంది పిల్లా జెల్లా లేని వాణ్ణి గనక, యీ వెంకట్రావుగార్ని చూచినప్పట్నుంచీ కొడుకును చూచినంత మనసయ్యి, ఏదో ఒక యింటివాణ్ణి చేద్దామనుకుంటున్నాను అంతే గానీ—నాకెందుకయ్యా యీ గొడవంతానూ? నాకేం జరక్కనా? [వుమ్మి వూస్తాడు]

బుచ్చి ఏవరి జరుగుబాటులు వారివి లెండి [నవ్వు]

వెంకట అతడెవడో పిచ్చివాడు—ఆ పిచ్చి కుర్రి మాటలకు మీరు వెయిటివ్వకండి బంగారయ్యగారూ నాకు మీలో కంప్లీట్ ఫెయిత్—సారీ—సంపూర్ణ విశ్వాసం వుంది నన్ను యీ మడిల్ నుంచి తప్పించక తప్పదు

బంగా ఆ! [వెగటుగా] నలుగురూ నాలుగు విధాల అనుకుంటే నాకేమీ బాగుండదు సుమండీ! ఎవరెట్లాపోతే నాకెందుకు మీ దోవ మీరు– [అర్ధోక్తి]

వెంకట నోనోనో! [బ్రతిమాలు భంగిమతో] ప్లీజ్, ప్లీజ్ మీరలాగంటే ఎలా చెప్పండి అంతా మీ చేతుల్లో పెట్టి మీరు చెప్పినట్లు నడుచుకుంటాను

బుచ్చి హీహ్హీహ్హీ [వెకిలినవ్వు]

బంగా అదుగో—ఆ వెకిలి నవ్వ్వాడూ, అచ్చంగా పిచ్చివాడే

వెంకట అతడిమాటలు ఖాతరుచేసి నా మాటలు నమ్మరూ? మీరే నన్ను కాదంటే యిక నేనేంగాను? ఇక ఏమయ్యో, గొయ్యో—

బంగా ఛాఛా! అంతమాటే? అంత భయమెందుకయ్యా? నువ్వింత యిదిగా అనుకుంటూంటే కాదంటానా? తప్పకుండా చేసి పెడతానుగా ఇక నీ పూచీ అంతా నాది

వెంకట *Thank you, Thank you*!! [*Quickly*] మీ దయ!

బుచ్చి [నెమ్మదిగా] నిజం చేదుగా వుండే రోజులు—అయినా, నాకెందుకీ గొడవ! [బీడీ తీసి] అగ్గిపెట్టె ఒకసారిస్తారా?

బంగా ఇక్కడేమన్నా ధర్మశాల పెట్టుకూచున్నా మనుకున్నావా-పంచిపెట్టేందుకు?

బుచ్చి (కనుబొమలు ముడిచి వింతగా చూస్తాడు)

వెంకట: (చేతిలోని అగ్గిపెట్టెమీద తాళంవేస్తూ-చికాగ్గా) రోగ్! ఆదొంగ బైరాగి యింకా రాలేదు

బంగా నే నిందాకే చెప్పలా—వుడాయించాడనీ!

వెంకట హ్రూం! అది నిజమే అయ్యుంటుంది

బుచ్చి బీడీలున్నాయ్, ఇమ్మంటారా?

వెంకట ఛీ—నా కవి మాస్తే నే గోత కాలేజిలో చదివేటప్పుడు త్రీకేజిల్స్ తప్ప తాగేవాణ్ణికాదు. ఈ పూర్గొచ్చాక ఆ మామగాడిమూలాన్న సిజర్స్‌తో సరిపెట్టుకోవలసి వచ్చింది

బుచ్చి • మేచ్‌బాక్స్ యిస్తారా?

వెంకట (అగ్గిపెట్టె యిస్తాడు) (విచారంగా) గంటన్నరయింది—సిగరెట్ తాగి (లేచి అరుగుమందు పచార్లుచేస్తాడు)

బంగా (ఆవలించి) ఇక నే పోయి పడుకుంటాన బాబూ

ప్రొద్దున్నే వెళదాంగాని, నువ్వూ యిక పడుకో (నిష్క్ర)

బుచ్చి (బీడీ వెలిగించుకుని అగ్గిపెట్టె యిచ్చి, చెట్టుక్రిందకి వెళ్ళి కూచుని కూనిరాగాలు తీస్తూంటాడు)

వెంకట (అగ్గిపుల్లతీసి పళ్లుకుట్టుకుంటూ పచార్లు చేస్తుంటాడు)

[ఇద్దరు గాజులశెట్లు వచ్చి ఎడమవైపు అరుగుమీద పడుకుంటారు అయిదు నిముషాలు ప్రకృతి ధ్వనులూ, బుచ్చిబాబు కూనిరాగాలూ, యీలపాటలూ తప్ప మరేమీ వుండదు

— పాట —

బుచ్చిబాబు
ఇదేనోయ్ మనలోకం—
—ఇదేనోయ్ మనరీతీ
ఇదే బాటలోనడకా—
ఇదే పంచలో పడకా ॥ఇదేనోయ్॥
ఇదేభేషజం బదుకూ—
ఇదే మానవులగతుకూ
ఇదే బానిసల బుద్ధీ—
ఇదే మేడిఫల దీప్తి ॥ఇదేనోయ్॥
ఇదే తెలియదగు సత్యం—
ఇదే చూడదగు దృశ్యం
ఇదే చెవులతో వినరూ—
ఇదే కనులతో గనరూ ॥ఇదేనోయ్॥

(పాటమధ్య ప్రతీ చరణం చివరా గాడిదల అరుపులు—కుక్కల కీచులాటలు—పాట నెమ్మదిగా ప్రారంభమై మధ్యమ స్థాయిలో అంతమవుతుంది చివర చరణం పాడుతూండగా పార్వతమ్మ, జానికమ్మ మూటలతో ప్రవేశించి అడుగుతారు)

పార్వ ఏమయ్యోయ్

జాని ఓ, పాటలాయనా

పార్వ నువ్వూరుకోవే (కేక) మిమ్మల్నే

జాని మీగోల మీదిగానీ—

పార్వ వూరుకోమంటూంటే (కేక) ఒక్కమాట బాబూ—

వెంకట (అటూయిటూ అనుమానంగా చూచి తానంతకుముందు పారవేసిన సిగరెట్ పీక తీసుకుని ముట్టించుతాడు)

పార్వ (వెంకటను చూచి) నువ్వన్నా పలుకు నాయనా?

బుచ్చి (లేచి అరుగువేపు వస్తున్నాడు)

వెంకట (దమ్ములాగి) ఏమిటదీ?

బుచ్చి (భుజంమీద చెయివేసి) ఆదేం పనీ! ఎంగిలిపీక—?

జాని హ్హూ (విసుగ్గా)

పార్వ ("ఖర్మ" అన్నట్లు తలమీద కొట్టుకుంది)

వెంకట ఎంగిలేమిటీ? నే పారవేశిందే

బుచ్చి అయితే మాత్రం?

వెంకట ఏం జేస్తాం—పళ్లుపీకుతుంటేనూ (దమ్ములాగాడు)

బుచ్చి (అరుగుమీదకు వెళుతూ) ఎన్ని చదివినా, ఎంత తెలిసినా—అలవాట్లకు బానిసలం! ప్చ్!!

జాని (ఓపిక పట్టలేక) ఏమండోయ్ (బిగ్గరగా)

పార్వ (కోపంగా) ఎవరిధోరణి వారిదేగానీ—(విసుగు)

వెంకట ఓ సారీ ఏమిటమ్మా మీ సంగతీ?

జాని ఇక్కడేదో సత్రముందన్నారు?

పార్వ (కసరుతూ) నువ్వూరుకోవే, నాతల్లీ ఇదేనాండి?

బుచ్చి కనపడ్డం లేదూ? ఇంతమంది—ఇన్నిరకాలు, మరెక్కడుంటారు?

వెంకట ఇదే అటు పడుకోండి బాటసారులూ?

బుచ్చి నిరాశ్రయులు! (ఎగతాళిగా)

జాని (మూట అరుగుమీద పెడుతూ) అంత ఎగతాళి చెయ్యక్కర్లేదు లెండి

పార్వ (కుడివైపు అరుగుమీద మూట పెట్టి విప్పుతూ) ఏదో ఖర్మంకాలి యిటా నడిచిపోతున్నాంగాని, మేమూ బాగా బదికిన వాళ్ళమే నాయినా

జాని మావా రున్నప్పుడు, మేమూ అంచక్క—

పార్వ ఆగితే కాస్తా తుడిచేశావుగా నా తల్లీ—నీ చల్లని పాదంపెట్టి!! (అశ్యాత)

జాని (విచారం) అయ్యో! ఆయనకు మతిచెడి, మాకిపోతే—నన్నంటారేం అత్తయ్యా?

పార్వ (పక్కవేస్తూ) అట్లాగం! నాకు తెలీవని మరీ బుకాయిస్తున్నావ్ వాడు నా మాటే వింటాడని—అసూయతో, కళ్లల్లో మంటపెట్టుకుని—మందు మరుల మందో పెట్టివుంటావ్. ఏమీ లేకుండా మతిపోవడానికి వాడేం తెలివి తక్కువవాడా?—చెప్పన్న శాస్త్రిలూ, ఏకసంతగ్రాహిగా పల్లించేవాడూ!

జాని (ఏడుస్తూ) అనండి నన్నే అనండి

వెంక ఓ ఎడేమ్సెల్ ఇన్ డిస్ట్రెస్. పాపం! పాతికేళ్లన్నా రాని నువ్వింత కష్టపడుతుంటే—జాలిపడవలసిందిపోయి, అట్లా కొరకొరలాడుతుందేమిటే; ఆ, మీ అత్తగారు?

జాని (కళ్లు తుడుచుకుని వెంకటరావు వైపు వింతగా చూస్తుంది)

బుచ్చి ఛాందసాన్ని ఉగ్గుపాలుగా తాగిన తల్లి, పాపం!!

జాని ఈ పాటలాయనసే దేమిటే? (విసుగు, అసహ్యం)

వెంకట ఏదో! పిచ్చివాడూ—పిచ్చి వాగుడూను!! (ఆమె వంక ఆశతో చూస్తూ) మీరు మీరు యీ చాపమీద పడుకోండీ?

పార్వ. (ప్రక్కమీద కూచ్చుని) రావేమే పిల్లా

జాని (కృతజ్ఞతతో) వస్తున్నా నత్తయ్యా—మీకు మరేమీ లేనట్లుంది—మేమక్కడ పడుకుంటాంగానీ, మీ చాపమీద మీరు

వంకట నోనో! మొహమాటపడకండి నే నిస్తున్నప్పుడు కాదంటే నా ప్రాణం చివుక్కుమంటుంది

[నక్కల అరుపులు]

బుచ్చి పరోపకారపారీణులు



జాని మీ రెంత జాలిగుండే! ఏణ్ణర్థం కాపరం వేసినా, మా వారొక్కనాడన్నా నా పడకసంగతి ఆలోచించారు కాదు (అత్తతో) నేనీ చాపమీద పడుకోనా అత్తయ్యా?

పార్వ అయ్యో! అయ్యో! ఎంత సిగ్గు చేటూ? ఇక్కడ పక్కలో నే అంటూంటే, పరాయిమగాడి చాపమీద పడుకుంటానంటావా? ఎంత బరితెగిపోయావంటేనూ? (లేచివచ్చి చెయిపుచ్చుకుని అరుగుమీదికి లాగుతూ) ఇలాటి చేష్టలుకూడానా? రా, రా

జాని (వెనక్కు తిరిగి వెంకట్రావుతో) మీమాట కాదన్నా ననుకోకండీ

పార్వ (నోరు చేత్తో మూస్తూ) అయ్యో అయ్యో!! ఇంకా మాటలుకూడానటే నోర్ముయ్

వెంకట రాకాసిపాలిటపడ్డ రామచిలుక (చాపమీద కూచ్చున్నాడు సిగరెట్ దమ్ము లాగేసరికి, అది అయిపోయి నోరును చురుక్కు మనిపించింది)

పార్వ (కోపంగా కోక బిగగట్టి) ఏమిటేమిటే? నేను రాకాసినా? పరాయి ఆడగూతురుతో హద్దుమీరి మాట్లాడే నువ్వు పెద్దమనిషివా? (బుచ్చిబాబుతో) నువ్వు చెప్పవయ్యా—ఆ పెద్దమనిషికి బుద్ధి! తను అనవరంగా నాకోడలితో మాట్లాడవచ్చునటగానీ- నే నా కోడల్ని అదుపులో పెట్టుకుంటే తప్పటా! రాకాసినట!!

బుచ్చి ఎవరిలోపాలు వారి కుంటాయ్ లెండి మీ కోడలిపై మీ ప్రవర్తనకూ, అతని జాలికీ మధ్య అనేకవిచిత్రాలు కనిపిస్తున్నాయ్ ఆయన నేతిబీర, మీరు చద్దన్నం మూటానని నా అభిప్రాయం

పార్వ పదికాలాలపాటు చల్లగా బతుకు నాయనా నా మంచితనం నీ కన్నా తెలిసింది

జాని మీ మంచితనం తెలిసేది అలాటి రౌడీసుకే లెండి

బుచ్చి అవునమ్మా—మెరిసే మేడిపళ్లకే యీనాడు గౌరవం!

వెంకట ఇక ఫులుస్టాపు పెట్టు మిస్టర్,—నేనుమాత్రం యీమె నేమన్నానూ? ఏదో ఆ అమ్మాయిని వుబ్బేసి నిద్రపుచ్చుదామని నే నలా అంటేనూ—

పార్వ (ఆశ్చర్యంగా) అలాగా!?

వెంకట అవునండీ పగలల్లా నడిచి అలిసిపోయున్నారూ! పైగా చిన్నతనపు చేష్టల కోడల్ని సంబాళించుకోటంతో సతమతమై వుంటారూ!! ఆమె నిద్రోతే నేగాని, మీకొంచెం కాస్త వెసులుబాటు చిక్కదనీ

పార్వ నిజమే నాయనా మొగదిక్కు లేక, అన్నీ నేనే చూచుకో లేక గుంప తెగుతూంది—కాని దేశంలో మా కష్టసుఖాలు చూచే దెవరూ?

వెంకట పాపం! ఈ కష్టాలతో మీ, కమ్మని ముఖం ఎంత కంది పోయిందో, అద్దంలో చూచుకున్నారా?

[నక్క అరుపులు]

పార్వ [సిగ్గు] అవును సుమా మొన్న మొన్నటిదాకా, ఎంత యిదిగా వుండేదాన్ని! మ్చ్ నా ప్రాణానికే చుట్టుకోవాలా యీ బాధలు

వెంకట అయ్యయ్యో! మీరు కూడా అంత దిగాలు పడితే ఎలా మీరు విచారిస్తూంటే చూడలేను నా కోసమైనా మీరు నవ్వాలి

పార్వ [నవ్వు తెచ్చుకుని] అలాగే ఏం? హ్హు

బుచ్చి [వెకిలినవ్వు] [నక్కల అరుపు ఆగుతుంది]

పార్వ ఘు ఘు [వెన్ను తట్టుకుని] ముసుగుకున్నాను పాడు! అదేం నవ్వయ్యా వెర్రి వాలకం?

వంకట ఎయ్—నీ వెర్రి చేష్టలిక మానవయ్యా

బుచ్చి ఏం ఎందుకు మానాలీ? మీ యిల్లా యిదీ?

వెంకట ఏదో—యీ ఆడవాళ్ళు, మేమూ కాస్త హాయిగా నిద్రోవాలా లేదా?

బుచ్చి అలాగా? అయితే సరే

వంకట ఇక మీరు

పార్వ అలాగే పడుకుంటానూ? అక్కడ [నవ్వుతూ, సిగ్గుపడుతూ వెళ్ళి పడుకుంది]

వెంకట [నవ్వ లొట్టలు వేస్తాడు]

బుచ్చి [వకిలిగా] "ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు"

వెంకట అబ్బబ్బ! టార్చరస్ ఏమిటయ్యా వాగుడూ పిట్ట కొంచెమూ కూత ఘనమూను

బుచ్చి తాడిచెట్టు అందరికంటే పెదది

వంకట ఈ సామెతలకేం?—పావ—

పెట్టి పుస్తకం కొంటే లక్ష సాపెతలు చాలా శ్రమపడ్డావు గానీ, యిక నిద్రపో

బుచ్చి ఏదో అకారణంగా దయ ఒలక బోస్తున్నారు?

వెంకట నువ్వెక్కడో—వసతాగిన పిట్టలాగున్నావ్ ఇక వాగించక—పడు కుందూ, పుణ్యముంటుంది!

బుచ్చి [నవ్వి] అహాహా! ఎవరి ఆశలు వారివి

వెంకట ఆశ లేనిదే మానవ జీవితమే శూన్యం

బుచ్చి ఆ ఆశల్లో కూడా మంచీ చెడూ, సాధ్యాసాధ్యాలుంటాయ్ స్వార్థలాలస వాంఛలూ, సమకాలికులకు కంటకం కాగల కోర్కెలూ రాక్షసాలు గాని—మానవ భోగ్యాలు కావు

వెంకట నువ్వో వేదాంతిలా మాట్లాడుతున్నావే?! ఎంతవరకూ చదివా వేమిటి?

బుచ్చి: చదువా? చెప్పుకోదగ్గ డిగ్రీలు లేవు.

వెంకట నేను ట్రిపుల్ ఎం ఏ ని

బుచ్చి అందుకనేనా—అర్ధాంగిపై అలిగివచ్చి తిరుగుతున్నారూ?

వెంకట అది వేరేవిషయం అదీగాక- ఈ మామగాళ్ళతో వ్యవహరించడం కాదు గా నాడిగ్రీ చదువుల్లో చెప్పేది?

బుచ్చి చెప్పిన ఆరోగ్య సూత్రాలు మాత్రం మీరు పాటిస్తున్నారా? ఆ బంగారయ్య వూసిన కళ్ళెలో పడిన సిగరెట్—

వెంకట అవసరం ఎంతపనైనా చేయిస్తుంది

బుచ్చి ఇదేనా మీరు నేర్చిన లాజిక్? బుద్ధికి కళ్లెం లేని రౌతనని చెప్పుకోరేం?

వెంకట ఛా ఏం మాటలవి? డీసెన్సీ నిల్

(కుక్కల అరుపులు—సుడిగాలి—ఎంగిలాకులు ఎగిరొస్తాయ్)

వినాయకరావు (లాల్చీ సవరించుకుంటూ, చెప్పులు మోగించుకుంటూ వచ్చాడు) ఛీ పాడుమనుషులు పాడు కొంపలు—పాడూరు—ఏం వూరిదీ?

బుచ్చి మన నోరు మంచిదైతే—వూ రేం చేస్తుందీ?

వినా: (కోపంగా) అదేమిటయ్యా— అయితే, నేను మంచివాణ్ణి కాదంటావా? ఎవిటి? నన్నే??-నే నెవర్నో తెలుసా? (పైపంచ తీసి గులపరించి రెడ్డిగం వేసుకూర్చుని కొరకొర మాస్తాడు)

బుచ్చి అదే తెలియడంలేదు

వెంక (అగ్గిపుల్ల వెలిగించి చూచి—) శుద్ధ ఖద్దరుధారి—గాంధేయులా!

వినా (సగర్వంగా మీసాలు సవరించుకుంటాడు)

బుచ్చి కిందది గ్లాస్కోపంచె కాదటండీ?

వినా: అయితేనేం? సిసలైన గాంధీవాదిని అందుకనే మనం హరిజనసేవక సంఘానికి—

బుచ్చి: దక్షులా? ఇకనేం—1948 మోడలా? 51 మోడలా?

వినా ఏమిటి వెటకారం? నాతోనే! నేనెవర్నో తెలుసునా?

బుచ్చి తెలుసుకుందామనేగా, అడిగింది?

వినా జిల్లా ప్రెసిడెంటు—ఏదీ యీ జిల్లా అందరికీ ప్రెసిడెంటున్నాడే— అతణ్ణి మనమే గద్దెక్కించింది మప్పయ్ గ్రామాల ఓట్లలో మూడొందలన్నా పోకుండా మావాళ్ళ పెట్టెలో వేయించాను

వెంకట (ఆశ్చర్యం) వెల్ వెల్!!!

బుచ్చి ఖద్దరుతో కన్యకప్పా(?) లక్ష్మితో మొట్టించా, అధికారపు లెటరజూపా?

వినా (తగ్గుతున్న దీపాన్ని ఎగదోసి) ఇంతకీ—నువ్వు కమ్యూనిస్టువు కాదుగదా?

బుచ్చి ఏం అరెస్టు చేయిస్తారా?

వినా (చిటికెలు వేస్తూ) మాకు నిమిషాలమీద

వెంకట అధికారపు ప్రచారన్న మాట!

బుచ్చి (ఎగతాళిగా) నేనప్పుడే అనుకున్నాను

వినా: అగుగో నువ్వు కమ్యూనిస్టువే

బుచ్చి కాదు బాబూ కాదు నేను యంత్రాన్నిమాత్రం కాలేను

వెంకట అయితే రాయిస్టవన్న మాట?!

వినా వాళ్ళెవరు? ఈ పార్టీ మాకే పోలింగుదగ్గరా తగల్లేదే—?

బుచ్చి వాళ్ళకు యీ పోలింగులమీద నమ్మకం లేదంటారు లెండి—కాని, నేనే యిష్టునీ కాదు—మనిషిని, వట్టి మనిషిని!

వినా ఇప్పుడర్థమయిందిలే! అయితే, మన దే పత్రికబాబూ?

బుచ్చి దినదినగండం, నూరేళ్లాయుష్షాను—ఏయిష్టూ కాకుండా మానవుడు బదకలేడని మీ అంచనా—కాని; నేను మనిషినే! మామూలుగా బదుకుతూనే వున్నాను

వెంకట అయితే, కోసెయిలర్ అన్న మాట?!

వినా: అంటే?

వెంకట మేం నిరుద్యోగపు బోటులో ప్రయాణీకులం లెండి

వినా అదా, సంగతి? మరి, నాకెప్పుడూ కనిపించలేదేం? మేం వారానికో, పది రోజులకో మద్రాసు పోతూనే వుంటాం ఒకసారి నాతో వచ్చెయ్యండి- మా వాళ్ళతో అనేక డిపార్టుమెంటులు పెట్టిస్తున్నామా—ఏదో ఒకదాన్లో తోసేద్దాంలే!!

వెంకట్ *Thanks*, — *Thanks*— ఏదో కాస్త గజెటెడ్ రేంకు దగ్గర్లో చూచారా, మీ మేలు మరువను ట్రిపుల్ ఎం ఏ ని మిమ్మల్ని తృప్తిపరచగల స్తోమతు వున్నవాణ్ణే లెండి! (లేచి, చాప యిచ్చి) యీ చాపమీద పడుకోండి సార్

వినా (చాప నాక్రమించి బుచ్చిబాబుతో) మరి, నీ సంగతో?

బుచ్చి మీరు సృష్టిస్తున్న ఆ స్వర్గంలో నాకు స్థానం లేదు నేనా మైత్రేయుతే

డన్ వాణ్ణి—మీ టిక్కెట్టూ కొనలేను. అదీగాక—జీతంరాళ్ళకోసం, అన్ని పనులూ నెత్తినేసుకుని ప్రజల్ని ఏడిపించే విధానాలు విశాలం చెయ్యలేను

వినా నువ్వెక్కడో సత్యకాలం మనిషిలా వున్నావేమయ్యా (ఎగతాళిగా) ఇలాగయితే ఎలా ఒకింటివాడ వవుతావూ అంట ?!

బుచ్చి ఇలా వుంటేనే బాగుందిలెండి

వెంకట్ ఒత్తి డిఫీటిస్టు !

వినా అంటే ?

బుచ్చి • "నా కూడా రాకపోతే నా చుట్టూ బలాదూరు"

వెంకట్ అది కాదులెండి మనం ఎందుకూ పనికిరానివారమని జపం చేశే నిరాశావాదులులెండి

వినా అసమర్థులు! వాళ్లఖర్మం అంతే!!

వెంకట్ వెల్ సెడ్, వెల్ సెడ్ !!

బుచ్చి • 'అతనికంటె ఘనుడు—ఆచంట మల్లన్న' (వెకిలినవ్వు) కానివ్వండి, కానివ్వండి !!

వినా (చేత్తో గాలి విసురుకుంటూ) ఛీ బొత్తిగా గాలే లేదు

వెంకట్ రూపాయి పోతే పోయింది—గురుమూర్తిగారు కూడా ముఖం చాటు వేశారు వారుంటే గాలి విసిరిద్దురు కూడా—

వినా (చెయ్యి అడ్డుపెట్టి) అహ ! వద్దు రేప్ (పంచెతో విసురుకుంటూ) మనం యిక్కడ తారసపడ్డం వుంది చూచావ్—నీ అదృష్టంవల్లనే వనుకో—

వెంకట్ చిత్రం చిత్రం.

వినా ఆఁ నీ పేరు ?

వెంకట్ వెంకట్రావు

వినా అయితే, వెంకట్రావూ—యిక్కడేమైనా కాస్త తింటానికి దొరుకుతుందంటావా ?

వెంకట్ మా అత్తవారిల్లు దగ్గర్లోనే వుందిగానీ—నే నిపుడక్కడికి వెళ్ళడానికి వీల్లేదండీ [కాలర్ నములుతూ]

వినా అదేం ? ఆషాఢమాసమా యేమిటీ ?

వెంకట్ [మతిబోయి, బాగుపడ్డట్టు తడబడి] ఆఁ, ఆ !! అదేనండి

బుచ్చి ఇవ్వాళ, కార్తీక అమావాస్య

వినా అలాగా ? అమావాస్య గనకనే యివ్వాళ, యీ వూర్లో యింత జరిగిందీ !! హ్హాఁ—పాడురోజు—పాడూరు

బుచ్చి ఇంతకీ, వూరుసంగతి చెప్పారే గాదు ?

వినా ఏముందీ—మళ్లీ ఎలెక్షన్లొచ్చాయా ? పదేళ్ళనుంచి మా పార్టీకే సపోర్టిస్తున్నారు ఆ మురుక్కాలవ తవ్వించమనికూడా అఘోరిస్తూనేవున్నారు ఈ సారికూడా యిస్తే ఓటివ్వండర్రా—అలాగే తవ్విద్దాం, అంటె ఒకళ్ళన్నా వినలేదు ఒక్కళ్ళకన్నా ముందుచూపు లేకపోయింది ఈ పదేళ్ళలో ఎన్నిరోడ్లో వేయించాము—ఆ విశ్వాసమన్నా లేకుండా నా నా మాటలూ అన్నారు—ఓట్లివ్వం అన్నారు

బుచ్చి అవునుమరి ! పదేళ్ళనుంచీ వాగ్దానాలు చేస్తున్నారేగాని ఆ మురుక్కాలవ తవ్వించగలిగారా మీరు ?

వినా దానికేమయ్యా—తవ్వించుకుంటే మూడురోజులా మూడుగంటలు పట్టదు — కానీ, అది కాస్తచేసేస్తే ఇక మామాట వీళ్లు వింటారా, ఏమన్నానా ?

వెంకట్ ఏదో ఒక ఆశవుంటేనేగాని వినరుగా మరీ !

వినా అదీ సంగతి ! అందువల్ల దాన్ని వాయిదాలు వేస్తూ వస్తున్నారు—ఇక యీ దెబ్బతో దానిగతి అంతే—అవతలి పార్టీ గెలిచేదీలేదు, వీళ్ళ మురుక్కాలవ తవ్వించేదీలేదు వాళ్ళ ఖర్మ !—కాకపోతే, వన్నీరోజున యింత అవమానంచేస్తారా ? ఒకరుకాకపోతే ఒకరన్నా భోజనానికన్నా పిలవలేదే—ఏం మర్యాదయ్యా యిదీ ? ఏం మనుషులు వీళ్ళూ ?

వెంకట్ మేనర్ లెస్ బీస్ట్స్ !! మీ అంతటి రాజకీయధురంధరుణ్ణి యింత మాత్రం మర్యాదన్నా చేయలేని యీ వూరివాళ్లు వట్టి బ్రూట్స్ లెండి !!

వినా : మంచీ, మర్యాదా, బాగుపడే లక్షణాలూ ఏ కోశానా లేవు

బుచ్చి అవునవును—బాగుపడేవాళ్ళయితే యింతకాలం మీ చెప్పులెందుకు మోస్తారూ ?—ఇప్పుడే మేలుకుంటున్నట్లున్నారు పాపం !

వినా అతని వేదాంతానికేంగానీ—వెంకట్రావూ, మరి తిండిసంగతి ?

వెంకట్ అలాగే—ఇక్కడ మన బంగారయ్యగారున్నార్లెండి లేపి కనుక్కుంటాను [గదిలోకి వెళ్ళాడు]

బుచ్చి [వ్యంగ్యంగా] మీ బంగారయ్యేలెండి !—లేకపోయినా—ఋణాలమీద వండించి వడ్డిస్తాడు

వినా మా బంగారయ్యా ? మాకా పేరుగల చుట్టాలు లేరే ?

బుచ్చి భస్ లేకపోవడమేమిటి ?—మీ చుట్టాలే అలాటి వాళ్ళయితేను !

వినా పరాచికాలాడుతున్నావా ?

బుచ్చి ఛాఛా ! మీతోనా—మీరే చూపండి—బంగారయ్య మీ చుట్టమేనని కావలించుకోకపోతే నా చెవి కోసి యిస్తాను

బంగారయ్య [జారిపోయే గోచిపెట్టుకుంటూ, రెండోచేత్తో లాంతరుతోవచ్చి] దణ్ణాలండి బాబూ, దణ్ణాలు ! మీ దరిశనం కోసం నాలుగుసార్లొచ్చాను పట్నంవెళ్లారని తెలిసింది—ఈవేళిలా దయచేస్తే [అర్ధోక్తి]

బుచ్చి దేవుడు ప్రత్యక్షమయినట్లుంది ! [ఎగతాళికి]

బంగా అంతేనండి—అంతే ! అయ్యవార్లు—చాపమీద కూచ్చున్నట్లున్నారు—మంచమన్నా తెస్తాను [వెళ్ళాడు]

బుచ్చి చూశారా—చుట్టరికం ! [వెకిలినవ్వు]

వెంకట్ వంట తయారవుతోందట—ఈలోపుగా కాస్త ఫలహారం తీసుకుంటారా బాబూ ?

బంగా [మంచం తెచ్చివేసి వెళ్లిపోయాడు—గదిలోకి]

వినా [మంచంమీద కూచ్చుని] ఇపుడా వంటాగింటా అక్కర్లేదుగానీ—ఆ వున్నదేదో షుమారుగా [చేత్తో ఎక్కువ చూపి] తీసుకురమ్మను

వెంకట్ [గది గుమ్మందగ్గరకెళ్లి] వంటొద్దులెండి—ఆ పళ్లెం తీసుకురండి [ఈవలికి వచ్చాడు]

బంగా [మిఠాయీ, ఫలాలూ గల పళ్లెంతో వచ్చాడు] మా యింటికొడయితే యివ్వాళెంత మర్యాదచేసేవాణ్ణో? మ్చ్! —ఇవ్వాళెంత మంచిరోజూ! ఎన్నాళ్ళనుంచో మీ దర్శనంకోసం—[అర్ధోక్తి]

బుచ్చి స్వాతివానకు ముత్యపుచిప్పలా ఎదురుచూస్తున్నారు

బంగా అంతేనండి, అంతే! మిమ్మల్ని చూస్తే—[అర్ధోక్తి]

బుచ్చి జన్మ తరించినట్లయింది

బంగా అంతేనండి, అంతే! యింకా —[తోచక, తల గోక్కుంటూ]

బుచ్చి మిమ్మల్ని చూచి ఆయన కళ్లు పువ్వులు పూచాయ్

బంగా మా గల్లాపెట్టిసాక్షిగా—[అర్ధోక్తి]

బుచ్చి కళ్లు కాయలు కాచాయ్—

బంగా ఆ అమ్మవారితోడు

వినా [తింటూన్న మిఠాయి మ్రింగి] ఆఁ? [కోపం]

వెంకట్ [నవ్వి] అదేమిటండీ, బంగారయ్యగారూ—ఆ పిచ్చివాడేదో ఎగతాళి మాటలంటూంటే మీరు కానక తలూపుతున్నారేమిటి?

బంగా [గతుక్కుమని] ఆఁ! [కోపంగా] ఏమయ్యోవ్—పానకంలో పుడకలాగా నువ్వేమిటయ్యా యిక్కడా? మేం చాలా మాట్లాడుకోవాలి—కాస్త వెళ్లిపోవయ్యా—

బుచ్చి మీరు మాట్లాడేవి నాకూ తెలుసు—కాని, నేనెందుకు వెళ్లిపోవాలి? ఇది ధర్మసత్రం!

బంగా అబ్బోయబ్బ! మాకు తెలీనట్లు —మేంమాత్రం అద్దె యిచ్చుకోవడం లేదూ?

బుచ్చి, గాడెక్కి లంచాలిస్తున్నారు!



నే నిక్కను—నే నిక్కడే వుంటాను—నన్నెవ్వరూ కదపలేరు

వెంకట్ ఇదుగో,అతడన్నింటికీ తెగించినవాడు—అతన్నేమీ అనకండి—

వినా అతను కమ్యూనిస్టయ్యా—

బంగా అయ్య బాబోయ్! కానలేకపోయాను—

వినా సరే—రేపు మాట్లాడుకుందాంలే [చెయికుడుచుకుని మంచంమీద పడుకుంటాడు-మరి కొంతసేపటికే గుర్రుపెడుతూ నిద్రపోతాడు]

వెంకట్ పోయి పడుకోండి బంగారయ్యగారూ [చాపమీద పడుకుని, నిద్రపట్టక అటూ యిటూ దొర్లుతుంటాడు]

బంగా [లాంతరు తీసుకుని గదిలోకి వెళ్లి తలుపు వేసుకుంటాడు]

బుచ్చి [బీడీ వెలిగించి మెల్లగా చెట్టు క్రిందికి వెళ్లి కూచ్చుని—కూనిరాగాలు తీస్తూంటాడు]

[దూరాన నక్కల అరుపులు—కుక్కల కీచులాటలు]

[దీపాలు ఒకటొకటే తగ్గి ఆరిపోతుంటాయ్—చివరికి ఒక్క ఎడమవైపు దీపం మాత్రం కునుకుతూంటుంది]

బుచ్చి [మెల్లగా ప్రారంభించి, శృతి హెచ్చించి పాడతాడు]

—పాట —

ఇంత ఘోరమా యీ బ్రతుకూ—
ఇంత నరకమా యీ జగతీ॥
ఎంతకాలమో యీ నడకా—
ఎంత దీర్ఘమో యీ యాత్రా ॥ఇంత॥
నీతి నియమముల—ఖాతరుచేయక
అందినమట్టుకు—ఆహుతిగాగొను
మేడిపండ్లు దా—రాజ్యపాలనము?
మంచితనానికి—మొట్టికాయలా??॥ఇంత॥
భేషజవేషులు—భావ దరిద్రులు
నక్కల గురువులు—నమ్మక ద్రోహులు
పతితాధములే—బ్రదుక నర్హులా?
సరళగాములకు—చావులె గతియా? ॥ఇం॥

[కుడి అరుగుమీదినీడ లేచి, ఎడమ అరుగు మీది చాపపైవున్న పురుషుని లేపుతుంది, ఇద్దరూ చీకటిలోకి వెళ్లిపోతారు కుడి అరుగుమీది మరో స్త్రీనీడ కదులుతుంది]

బుచ్చి [పాడుతూనే వుంటాడు]

కొంచెపు బుద్ధులు—క్రోధానూయలు
నీచస్వార్థములు—నిండిన మనుషులు
చంపివైతురా—శాంతిదేవతను?
సంస్కారానికి—తావే లేదా?? ॥ఇంత॥

బుచ్చి (నిట్టూర్చి నిద్రపోతాడు—అక్కడే)

గురుమూర్తి (దొంగవలె చిలుము గొట్టాంతోసహా ప్రవేశించి, పరున్నవారిని పరికించి, తృప్తిగా తలూపి ఎడమవైపు అరుగునానుకుని చీకట్లో కూచ్చుని—చిలుము తయారుతూంటాడు)

బీటుపోలీసు ఈలవేసుకుంటూ, లాఠీ తిప్పుకుంటూవచ్చి కుడివైపు అరుగుమీద కూర్చునేందుకు ప్రక్కగా వెళతాడు. కాలికి గురుమూర్తి తగులుతాడు) ఏయ్ ఎవడ్రా?

గురు ఓం సద్గురూ—ఏం సద్గురూ?

పోలీసు వ్ నువ్వట్రా? చిలుము వాసనేస్తూందే ?

గురు గురుగాయత్రి ఒక్కసారి చూస్తారా?

పోలీసు (ప్రక్కనే అరుగుమీద కూర్చుని) తేవోయ్—

గురు (చిలుము అందించుతూ) అంతా పీల్చెయ్యకండి గురూ!

పోలీసు ఊఁ రానియ్ (తీసుకుని; దమ్ము గుఫ్‌గుఫ్‌న లాగుతూంటాడు మూడుగుక్కల్లో అయిపోయింది) ఛస్! అయిపోయిందిరా

గురు (బేలమొఖంతో) నాకు తీరనేలేదండీ

పోలీసు (చిలుముగొట్టం పారవేసి) ఛస్! నాకుమాత్రం యిదేం ధూపంరా?

గురు ఆయనెవరో సిగరెట్లు తెమ్మని రూపాయిత్తే, నాకేసి—యిది కొని—యీ రోజన్నా కైలాసం చూద్దామని ఎంతో ఆశపడ్డాను సవాసేరులో బోడిపరాచకంలాగా మధ్యలో మీరూ—

(46-వ పేజీ చూడండి)




# శక్తికిమించినపని

★ శ్రీ కవిరావు

గారెంమ్ముక్రొను రంగయ్యొకడా
బేరము సాగకపోవుటచే,
దొంగలగుంపున చేరి యూరిలో
దోపిడీలు సాగించాడు.

అద్దము రాతిరి మంగలి రాముని
మిద్దెకు కన్నం ఒకనాడు
వేసి, మిద్దెలో గల సామానుల
దోచుకొనగ సాగించారు.

రంగయ్యంతట వంకెనుగల యొక
మంగలి డోలును చూచాడు,
దరువు వేయగా వలెననుకొని సం
బరపడి మెడలో తగిలించి—

'తద్దిమికిటకిట, తద్దిమి' యంచును
మద్దెల దరువులు వేశాడు
అద్దము రాతిరిమద్దెల దరువుకు
మిద్దెవారు మేల్కొనగానె,

ఎక్కడి, దొంగల నాయకు లక్కడె
పిక్కబలము చూపించారు.
కంగారునపడి పాపము కోమటి
రంగయ తికమకపడ్డాడు.

దారిలేక రంగయ్య చివరికిక
పారిపోవగా నుంకించి,
మిద్దెకువేసిన కన్నంలో ఆ
మద్దెలతోనే దూరాడు.

చాలీచాలని కన్నంబసలది
డోలుకూడ మెడ కింకొకటై
పారిపోవగా వీలుగాక ఆ
యూరివారలకు చిక్కాడు.

చిక్కినవానిని చిక్కినట్లు పెడ
రెక్కలు విరచియు కట్టి యికన్
బుద్ధిలేని రంగయ్యకు మెత్తగ
గుద్దుల బెల్లం బెట్టారు.

శక్తికిమించిన పనులెవరైనా
చేయగవలెనని మొదలిడితే,
నానా బాధలు పడిపడి చివరకు
నాశనమై చెడిపోతారు.

# ★ పక్షులు ★



దర్జీపిట్ట పిచ్చికకంటె చిన్నది. ఇండియా, బర్మాలలో అన్నిచోట్లా కనిపిస్తుంది. దట్టమైన అరణ్యాల్లోను, జనావాసాల్లోను కూడా నివసిస్తుంది. దీన్ని సుఖంగా పెంచవచ్చును. మనుషులంటే దీనికి భయంలేదు. ఇళ్ళలోకి వచ్చి నేలమీద గెంతుతూనో, పురుగులుఏరుకుని తింటూనో వుంటుంది. "టు విట్ టు విట్ టు విట్"అనిఅరుస్తుంది. ఏప్రిల్, సెప్టెంబరు నెలల మధ్య గుడ్లు పెడుతుంది. దీనిగూడు బలే తమాషాగా వుంటుంది. మెత్తటిదూది, ఉన్ని, బూచ్చు తెచ్చుకుని ఒక వెడల్పాటి ఆకును దొన్నెలాగ మడిచి కుట్టివేస్తుంది. ఆ దొన్నెలో గుడ్లు పెడుతుంది. ఒక్కొక్కసారి రెండుమూడు ఆకులను కలిపి కుట్టుతుంది. కుట్టుపనికి పత్తితో తనంతట తనే దారాల్లాగ తయారుచేసుకుంటుంది. వెడల్పాటి ఆకులుండే చెట్లమీదో, లతలమీదో మాత్రమే గూడు కడుతుంది. ఆడ మగ పిట్టలు రెండూ గూడు నిర్మాణంలో పనిచేస్తాయి.

ఈపిట్టల్ని చూస్తే ఎప్పుడూ ఉల్లాసంగా, హాయిగా ఆడుతూ పాడుతూ ఎగురుతున్నట్టు అనిపిస్తుంది. చల్లటి నీడనిచ్చే తోటల్లోను, పొదల్లోను విహారిస్తాయి. సాధారణంగా ఆడ, మగ జతగూడి తిరుగుతూ, ఎగిరే పురుగులను వేటాడి తింటూవుంటాయి. ఒక చెట్టునుండి ఒకచెట్టుకు ఒయ్యారంగా, సునాయాసంగా ఎగురుతుంటే చూడ ముచ్చటవుతుంది. వీటి ముఖ్యాహారం పురుగులు, ఈగలు. ఫిబ్రవరి, జులై నెలల మధ్యకాలంలో గూళ్లుకట్టి గుడ్లు పెడతాయి.

దాసరిపిట్టలు






(బొమ్మలు వాల్ట్ డిస్నీ ప్రొడక్షన్సు,
ఆర్ కె ఓ రేడియోవారి సౌజన్యంతో)

## 30 గుప్తధనం కోసం

డాక్టరుగారు వెళ్లగానే నేను, సిల్వర్ మట్టికోటలోకి వెళ్లాము కళాసీలు వంట పూర్తిచేశారు మాకోసం ఎదురు చూస్తున్నారు మేము రాగానే భోజన పదార్థాలన్నీ వడ్డించారు అందరం కూర్చున్నాం. చిలక సిల్వర్ బుజంమీద కూర్చుంది సిల్వర్ అందరినీ ఛలోక్తులాడుతూ నవ్విస్తున్నాడు.

"అరేయ్ అబ్బాయిలూ! లాంగ్ జాన్ సిల్వర్ ఇంకా మీతోనే వున్నాడు గనక బతికిపోయారు. మనకు కావలసిన దాన్ని సంపాదించాను ఆ ఓడ మాత్రం వాళ్ళదగ్గరే వుంది ఎక్కడ దాచారో నాకు తెలియదు. పాతరతవ్వి బంగారమంతా సంచుల్లో పోసుకుని సిద్ధమయ్యాక అప్పుడు వెదుకుదాం ఓడకోసం. ఓడ మన చేతికి వచ్చిందీ అంటే తస్సదియ్య వాళ్ళపని ఆఖరే"

నోట్లో మాంసం ముక్కలు కుక్కుకుంటూ సిల్వర్ ఈరీతిగా అనుచరులను ఉషారు చేస్తున్నాడు మనుషులను మాటలతో బుట్టలో వేసుకోడం సిల్వర్ కు ఉగ్గుతో పెట్టిన విద్య అనిపించింది

"ఇక జిమ్ హాకిన్స్ సంగతి మనం ద్వీపంలోకి బయలుదేరే టప్పుడు తాడుతో కట్టి మనతో తీసుకుపోదాం ఈకుర్రాణ్ణి మనదగ్గర తాకట్టు పెట్టారు వాళ్లు బంగారం, ఓడ రెండూ సంపాయించాక హాకిన్స్ ని మీకప్పగించేస్తాను. అతన్ని మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి"

ఈమాటలతో కళాసీలకు సిల్వర్ మీద మరింత నమ్మకం కుదిరింది సిల్వర్ ఏది చేసినా తమ మంచికోసమేననే భావం కలిగినట్లుంది నాకు మాత్రం మళ్ళీ భయాలు, సందేహాలు చెలరేగాయి సిల్వర్ ముఖం చూసి నిజంగా అంటున్నాడో, వూరికే అంటున్నాడో కనుక్కోవడం కష్టం ఒకవేళ అతనికి బంగారపు పాతర, ఓడకూడా అనుకున్నట్లే లభ్యమైతే డాక్టరుగారికిచ్చిన వాగ్దానాలన్నీ భంగంచేసి నన్ను ఒకదెబ్బతో హాత మారుస్తాడనేది నిస్సందేహం

అలాగాక అతడు నిజంగానే మా పక్షాన చేరదలుచు కున్నట్లయితే అతని కుతంత్రం మిగతా వాళ్ళకి

**జరిగినకథ :**

మాకు బ్రిస్టల్ నగరసమీపంలో ఒక హోటల్ ఉంది ఒకరోజున మా హోటలుకు 'బిల్' అనే సముద్రపుదొంగ తనతోటి దొంగలనుండి తప్పించుకుని పారిపోయివచ్చాడు అతడు మా హోటల్లో ఉన్నాడని మిగతా దొంగలకు తెలిసి, అతన్ని చంపేస్తామని బెదిరించారు అతడు ఆ బెదిరింపుకే భయపడి చనిపోయాడు అతని పెట్టెలోనే మాకు కాంచనద్వీప పటం దొరికింది ఆపటాన్ని మా డాక్టరుగారికి, జమీందారుగారికి చూపాను వెంటనే అక్కడి ధన నిక్షేపాలు సంపాదించే ఆశతో అక్కడికి ప్రయాణమయ్యాము జమీందారుగారొక ఓడను సిద్ధం చేశారు స్మాలెట్ అనే అతన్ని కెప్టెనుగాను, లాంగ్ జాన్ సిల్వర్ అనే వాణ్ణి వంటవాడుగాను కుదిర్చారు సిల్వర్ అసలు సముద్రపు దొంగల్లో వాడే అయినందున, మిగతా కళాసులందరితో కలిసి మమ్మల్ని చంపడానికి పెద్దకుట్ర పన్నాడు ఆకుట్ర నెదుర్కోటానికి మేము ఎదురు సన్నాహాలు చేసుకున్నాం ఇంతలో కాంచనద్వీపం చేరాము ద్వీపంలో నేను ఒంటరిగా తిరుగుతుండగా బెన్ గన్ అనే అడవిమనిషి కనిపించాడు తన్ను తిరిగి ఇంగ్లండుకు ఓడలో తీసుకుపోయేట్లయితే గుప్తధనమంతా మాకిచ్చేస్తానన్నాడు నేను నామిత్రులతో ఈ విషయం మాట్లాడతానని వాగ్దానం చేశాను ఈలోగా నా మిత్రులు అవసరమైన సామగ్రి అంతటితోను ఓడను వదలి ద్వీపంలోవున్న మట్టికోటను ఆక్రమించుకున్నారు నేను అనేక సాహసకృత్యాల అనంతరం ఓడను తిరుగుబాటుదారులనుండి తప్పించి ఒక సురక్షిత స్థలంలో దాచాను చివరకు శత్రువుల చేతిలో చిక్కాను

అనువాదం : శ్రీ నండూరి రామమోహనరావు

తెలియకుండా ఎక్కువకాలం దాచలేదు. అప్పుడు నేను సిల్వర్ కలిసి బలాఢ్యులు, సాయుధులు అయిన ఈ కళాసీలతో పోరాడాలి మేమిద్దరం అందరి నెదుర్కొని బతకటం కలలోమాట.

ఇవన్నీ ఇలావుంచి నామిత్రుల ప్రవర్తన నాకింకా అయోమయ సమస్యగానే వుంది. వాళ్లు మట్టికోట నెందుకు విడిచిపెట్టినట్టు? కాంచనద్వీప పటం సిల్వర్ కెందుకు ఇచ్చేసినట్టు? "పాతరలో గులకరాళ్లు కనిపిస్తే తెల్లబోకు" అని డాక్టరుగారు సిల్వర్‌తో ఎందుకన్నారు? ఈ ప్రశ్నలతో నామనస్సు అల్లకల్లోలమై భోజనం సయించనే లేదు

భోజనాల తరవాత తిరుబాటుదారులంతా గుప్త ధనంకోసం బయలుదేరారు నేను తప్ప మిగతా అందరూ సమృద్ధిగా ఆయుధాలు ధరించారు సిల్వర్ బుజానికి రెండు తుపాకీలు తగిలించుకున్నాడు బెల్టుకొక కత్తి తగిలించాడు. జేబుకొక పిస్టల్ చొప్పున దాచుకున్నాడు ఈ అవతారానికి తోడు కెప్టెన్ ఫ్లింట్‌ను బుజాన ఎక్కించుకున్నాడు ఒకమోకు నా నడుముకుకట్టి పట్టుకున్నాడు పెంపుడు ఎలుగుబంటిలాగా అతనివెనక నేను నడిచాను

మిగతా కళాసులు రకరకాల పనిముట్లు ధరించారు గడ్డపలుగులు, పారలు, గొడ్డళ్లు, గోనెసంచులు, తినుబండారాల సంచులు మొదలైనవన్నీ చేత పట్టుకున్నారు

కళాసీలు సరాసరి ద్వీపంలోకి దారి తీయలేదు వారి రెండు పడవలూ రేవులో ఉన్నాయి వాటిని నా మిత్రులనుండి కాపాడుకోవలసిన అవసరం వున్నది అందుచేత ముందు రేవుకు దారి తీశారు. పడవలెక్కి బయల్దేరాము రేవుకు పశ్చిమంగా ఒక చిన్ననది సముద్రంలో పడుతున్నది. ఆనదీ ముఖద్వారం చేరి అక్కడ దిగాము

తరవాత ఉత్తరంగా కనిపించే చిన్న కొండకేసి నడవసాగాము. దారిలో కళాసీలు ఒకళ్ల తరవాత ఒకళ్లు ద్వీపపటం పుచ్చుకుని పరిశీలించారు మా ఎదురుగా రెండు మూడు వందల అడుగుల ఎత్తుగల ఒక పీఠభూమి వున్నది దాని ఉత్తరపువేపు వాలు టెలిస్కోపు కొండ దక్షిణపు వాలుతో కలుస్తోంది. పీఠభూమిపైన దేవదారు వృక్షాలు మబ్బుల నంటేట్లు ఎత్తుగా, ఒత్తుగా పెరిగివున్నాయి చెట్లమధ్య అల్లిబిల్లిగా పెరిగిన అడవిలతలు మార్గాన్ని దుర్గమం చేస్తున్నాయి

మేము సరాసరి పీఠభూమి ఎక్కడం ప్రారంభించాము అడవి తీగెలను ఛేదించి మార్గం చేసుకుంటూ ముందుకు పోతున్నాము. ద్వీపంలో ఇప్పటి వరకూ నేనుచూసిన అన్ని ప్రదేశాల్లోకీ ఈప్రదేశమే మనోహరంగా వుంది. అడవి పువ్వులు విరియబూసి ఆహ్లాద కరమైన వాసనలు వెదజల్లు తున్నాయి పొదలు ఒకదానితో ఒకటి పెనవేసుకుని చక్కని పొదరిళ్లుగా తయారయ్యాయి ఏమి టేమిటో పక్షులు చెట్లలో కనిపించకుండా దాక్కుని సంగీత ధ్వనులు చేస్తున్నాయి సూర్యుడు తీక్ష్ణంగావున్నా చెట్ల నీడల్లోంచి నడుస్తుంటె చల్లని సముద్ర వాయువులు వీచి అలసట తీరుస్తున్నాయి

కళాసీలు ఆత్రం పట్టలేక మాకంటే ముందుకు పరిగెత్తుతూ కేకలువేస్తూ పోతున్నారు సిల్వర్, నేను వెనకబడి పోయాము కుంటికాలుతో ఎత్తు ఎక్కడం సిల్వర్‌కు ఆయాస కరంగా వుంది అనేకసార్లు నేను చేయూత ఇవ్వకపోతే కాలుజారి కింద పడిపోయేవాడే

ఈవిధంగా ఒక అరమైలు దూరం పోయాము పీఠభూమి శిఖరాన్ని ఇంకా సమీపించలేదు ఇంతలో అందరికంటే ముందుకు దూకుడుగాపోయిన ఒకకళాసీ, "అయ్యో బాబోయ్, అమ్మ బాబోయ్," అని కేకలు వేయుగాసాగాడు వాడికి కొంత దూరంలో వెనకవున్న కళాసీలు ఆకేకలువిని ఉన్నచోటనే స్తంభించిపోయారు. నేను, సిల్వర్ వాళ్ళని సమీపించాము సిల్వర్ దారితీశాడు అతని వెనకాల అడుగుల్లో అడుగులు వేసుకుంటూ మిగతావాళ్లు అనుసరించారు.

కేకలు వేస్తున్న కళాసీకి ముచ్చెమటలు పోసి ప్రాణం కడబట్టింది భయంతో ముఖం పాలిపోయింది తిరాచూస్తే వాడి భయానికి కారణమైన పదార్థం అయిదారు గజాల దూరంలో వుంది ఒక దేవదారు వృక్షంకింద మనిషి అస్థిపంజరం ఒకటి ఉంది. దాని పక్కన శిథిలావస్థలో వున్న చొక్కా, లాగు వున్నాయి అది చూడగానే ఒక్కసారిగా మా అందరి కాళ్లు చేతులు చల్లబడినై

అందరిలోకీ ధైర్యస్థుడు జార్జిఅస్థి పంజరాన్ని సమీపించి, గుడ్డ పేలికలను పరీక్షించాడు

"పాపం ఎవడో కళాసీయే ఈగుడ్డలు చూస్తే తెలుస్తోంది, అన్నాడు జార్జి ”

"కళాసీ కాకపోతే మహారాజు వస్తాడను కున్నావా ఈ లంకకి? కాదుగాని ఈఅస్థి పంజరాన్ని ఎవరో మనుషులే ఇక్కడ పెట్టినట్టుగా తోస్తోంది చాలంతట అయితే ఇల్లా ఎప్పటికీ వుండదు," అన్నాడు సిల్వర్

సిల్వర్ చెప్పింది నిజం కావచ్చు ననిపించింది ఎందుకంటే అస్థిపంజరం ఎక్కడా వంకర లేకుండా సమానంగా వుంది కాళ్లు ఒకదిక్కును, చేతులు తల పైకి ఎత్తబడి మరొక దిక్కును సూచిస్తున్నట్లుగా వున్నాయి

"నాకేమని తోస్తోందంటే, ఈ అస్థి పంజరం, దిక్కేదో చూపించటానికి ప్రయత్నిస్తోంది చేతు లున్నవేపు సూటిగా చూడండి దెయ్యాలదీవి కని పిస్తోందా లేదా? మరి ఈకాళ్లు ఏం చూపిస్తున్నాయి? బహుశా డబ్బు పాతరవున్న దిక్కును చూపిస్తూ వుండవచ్చు తన్నదియ్యా, ఇది ఫ్లింట్ గాడిదెబ్బే వాడు అఖండుడులే గుర్తుకోసం ఈ ఎముక లిక్కడ ఉంచి ఉంటాడు నాకు జ్ఞాపకముంది ఇప్పటికీ డబ్బు ఇక్కడ పాతి పెట్టటానికి వచ్చినప్పుడు ఆరుగుర్ని వెంట పెట్టు కుని వచ్చాడు ఆరుగుర్నీ తనే టపటప చంపేశాడు అందులో ఒకణ్ణి ఇక్కడ కీడ్చుకొచ్చి ఈమాదిరిగా పడుకో బెట్టినట్లున్నాడు కాని—కాని—ఈపొడుగాటి ఎముకలు, పొడుగాటికాళ్లు, చేతులు చూస్తుంటే ఎవడో జ్ఞాపకం వస్తున్నాడు ఆ—ఎలర్ డైస్ టామ్ మోర్గన్! నీకు జ్ఞాపకం వున్నాడా ఎలర్ డైస్?" అని అడిగాడు సిల్వర్

"జ్ఞాపకం లేకేం! వాడు నాకు డబ్బు బాకీ వున్నాడుకూడాను ఎలర్ డైస్ సంగతేమోకాని ఫ్లింట్



చేతులున్న వేపు సూటిగా చూడండి దెయ్యాలదీవి కనిపిస్తోందా లేదా

ఇక్కడే దెయ్యమై తిరుగుతూ వుంటాడని నా భయం', అన్నాడు మోర్గన్

"ఫ్లింట్ చచ్చిపోవటం కూడా దారుణంగా చచ్చాడు ఎప్పుడూ ఒకచేత్తో కత్తి, ఇంకో చేత్తో రమ్‌సీసా పట్టుకుని "యో—హో—హో—బలె గుమ్మైనరమ్," అంటూ పాడేవాడు ఆపాటవిని చెవులు గింగుర్లెత్తాయనుకో నాకు అసలప్పటి నుంచీ ఆ పాట వింటే నాకు వళ్లు జలదరిస్తుంది," అని జార్జి అన్నాడు

"ఏమైనా చచ్చిపోయిన వాడు చచ్చిపోయిన వాళ్ళలోనే లెక్క. మళ్ళీ మన్ని వేపుకు తింటానికి వస్తాడంటే నేను నమ్మను అందులో పగటిపూట ఇంత వెల్తురు వుండగా అసలు రాడు ఇక లేవండి పోదాము," అని సిల్వర్ మళ్ళీ ముందుకు దారితీశాడు

ఈసారి కళాసీలు సిల్వర్‌ను విడిచి దూరం పోలేదు ఒకప్పుడు తమతో తిరిగిన ఎలర్ డైస్‌కు పట్టిన గతి చూసి వారిగుండెల్లో అర్థంకాని భయం ప్రవేశించింది గట్టిగా మాట్లాడటానికి, ఊపిరి తీయటానికి కూడా వెరుస్తూ సిల్వర్ నంటిపెట్టుకునే నడవసాగారు

## 31 గాలిలో పాట

శ్రీరభూమి శిఖరం చేరగానే మార్గాయాసం తీర్చుకోడానికి అందరం కూర్చున్నాము శిఖరం మీద నుండి ద్వీపంలో చాల దూరంవరకూ కనిపిస్తోంది ఒకపక్కన ఫ్లింట్ అగ్రం కనిపిస్తోంది ప్రకృతి బహు నిశ్శబ్దంగా, నిశ్చలంగావుంది దూరంనుండి సముద్ర తరంగాల మోత అస్పష్టంగా వినవస్తోంది ఈ ఏకాంతం మా మనస్సుల్లోని బరువును ఇంకా వృద్ధిచేసింది

సిల్వర్ జేబులోంచి దిక్సూచి తీసి పటంలో చెప్పబడిన దిక్కులు నిర్ణయించుకున్నాడు

"ఇక లేద్దామా? లేక భోజనాలు కానిచ్చి పోదామా?" అన్నాడు సిల్వర్

"నాకేమిటో భయంగా వుంది ఫ్లింట్‌ను తలుచుకున్న కొద్దీ కాళ్లు గజగజ లాడుతున్నాయి," అన్నాడు మోర్గన్

"బతికి వున్నప్పుడే పిశాచంలాగ వుండేవాడు ఫ్లింట్ చచ్చిపోయే రోజుల్లో మొహం నీలంగా మారిపోయింది," అన్నాడింకొకడు

"అవును, నీలంగా వుండేది రమ్ తెగతాగితే అల్లాగే అవుతుంది," అన్నాడు జార్జి

అస్థిపంజరాన్ని చూసిన దగ్గర్నుంచి కళాసీలు గట్టిగా మాట్లాట్టానికి జంకుతున్నారు ఫ్లింట్‌ను గురించి మాట్లాడేటప్పుడు ఫ్లింటు దెయ్యం వింటుందేమో నన్నట్లు గుసగుసగానే మాట్లాడుతున్నారు అందుచేత నిశ్శబ్దానికే మీ భంగం కలగటం లేదు.

ఇంతలో మా ఎదురుగా కొండవాలుపై వున్న చెట్ల నడుమనుంచి కీచు గొంతుకతో పాడుతున్న పాట వినిపించింది

"కిమ్మనకుండా గమ్మునతాగెయ్
యో—హో—హో—బలెగుమ్మైనరమ్"

ఈపాట వినగానే కళాసీలకు మూర్ఛ వచ్చినట్లయింది ఒక్కసారిగా భయంతో బిగుసుకుపోయారు తర్వాత అదేపనిగా వణికిపోయారు ఆపాట ఇంకా వినిపిస్తూనే వుంది మంత్రానికి కట్టుబడిన పాముల్లాగా నిశ్చేష్టు లయ్యారు

పాట ఎంత హఠాత్తుగా ప్రారంభమైందో అంత హఠాత్తుగా ఆగిపోయింది వెంటనే కళాసీలు సిల్వర్ చుట్టూ ఒకళ్ళనొకళ్ళు కావలించుకుని ముడుచుకుని కూర్చున్నారు మోర్గన్ నేలమీదపడి ముఖం కప్పుకున్నాడు

"బాబోయ్, బాబోయ్, అది ఫ్లింట్ గొంతికే," అని గోలగాడు

సిల్వర్ మొదట అదిరిపడినా వెంటనే తేరుకున్నాడు కళ్ళు చిట్లించి పాట వినవచ్చేదిశగా తేరిపారచూశాడు

"పిరికి సన్నాసులారా! భయపడతా రేమిట్రా ఫ్లారికేను దెయ్యమైతే, ఏం మీదపడి మింగుతుందా? అసలు దెయ్యంకాదు, గియ్యంకాదు ఎవడో మనిషే మన్ని భయపెట్టటానికి పాడుతున్నాడు," అన్నాడు సిల్వర్

సిల్వర్ మాటలతో కళాసీలకు కాస్త ధైర్యం వచ్చింది ఒకొక్కడే లేచి నుంచుంటున్నాడు మళ్లీ హఠాత్తుగా ఆ కీచుగొంతిక వినిపించింది ఈసారి పాట కాదు

"డర్బీ! రమ్ తీసుకురారా, డర్బీ! రమ్ తీసుకురా", అని వినిపించింది, మళ్ళీ ఆగిపోయింది



ఎవడో మనిషే మన్ని భయపెట్టడానికి పాడుతున్నాడు అన్నాడు సిల్వర్

"అదే అదే ఫ్లింట్ దెయ్యమే ఫ్లింట్ చచ్చిపోతూ సరిగ్గా అలాగే అరిచేవాడు సందేహం లేదు, ఫ్లింట్ మళ్ళీ వచ్చాడు," అన్నాడు మోర్గన్

డిక్ తన బైబిల్ తీసి బిగ్గరిగా ప్రార్థనలు చదవసాగాడు అందరూ వాడిదగ్గర చేరి ప్రార్థనలో పాల్గొన్నారు కాని సిల్వర్ మాత్రం ఇంకా లొంగలేదు లోపల ఎంత భయపడుతున్నా పైకి మాత్రం ధైర్యం చూపిస్తున్నాడు

"తమాషాగా వుందే ఈలంకలో వున్న వాళ్లెవరూ డార్బీ పేరు విని వుండరు మనకి తప్ప డార్బీ పేరు తెలియదు ఏమైనా సరే, అది భూతంగానీ, దెయ్యంగానీ — తస్సదియ్యా, నేను డబ్బుమాత్రం విడిచిపెట్ట దలచుకోలేదు ఫ్లింట్ బతికి వున్నప్పుడే వాణ్ని నేను లెక్కచెయ్యలేదు చచ్చిపోయింతరవాత భయపడతానా ఇక్కడికి ఫర్లాంగు రెండు ఫర్లాంగుల దూరంలో ఏడులక్షల పౌనుల నాణాలుండగా, దెయ్యాలకి జడిసి పారిపోతానా? తస్సదియ్య"

కాని కళాసీ లెవరూ కదల్లేదు సిల్వర్ దెయ్యాలను అవమానిస్తున్నందుకు ఇంకా భయపడిపోయారు వాళ్ళు

"సిల్వర్! దెయ్యాలకు కోపం రావచ్చు, అల్లా మాట్లాడబోకు వాటితో దెబ్బలాట పెట్టుకోవటం ఎందుకు?" అన్నాడు జార్జి

"దెయ్యాలా? ఆగొంతిక దెయ్యమని అనుకోను చూశావా ప్రతిధ్వని కూడా వినిపించింది? దెయ్యాలు ఎండలో నుంచుంటే నీడ పడటం ఎప్పుడన్నా చూశావా? నీడ ఉంటే దెయ్యం కాదన్న మాట అల్లాగే దెయ్యాల మాటలకి ప్రతిధ్వని వినిపించదు కనక అది ఎవరో మనిషే గాని, దెయ్యం కాదు

సిల్వర్ వాదన కళాసీలమీద కొంతవరకూ పనిచేసింది కొద్దిగా ధైర్యం కోలుకున్నారు జార్జి ఇలాగన్నాడు "నువ్వు చెప్పింది నిజమే సిల్వర్

అది ఫ్లింట్ గొంతిక మాదిరిగా వున్నదిగాని పూర్తిగా ఫ్లింట్ అనిపించటం లేదు ఫ్లింట్ కాదు, అది.. ఎక్కడో విన్నగొంతికే "

"తన్నదియ్యా బెన్‌గన్‌రా," అని అరిచాడు సిల్వర్.

"అవునవును బెన్‌గన్నే అనుమానం లేదు," అని అంతా ఒక్కసారిగా అన్నారు

డిక్ వీళ్ళలో కొత్తగా చేరినవాడు గనుక బెన్‌గన్ ఎవడో అతనికి తెలియదు,

"బెన్‌గన్ దెయ్యమైతే నేం, ఫ్లింట్ దెయ్యమైతే నేం మన్ని పీక్కు తింటానికి?" అన్నాడు డిక్.

మిగతావాళ్లు డిక్ మాటలు విని హేళనగా నవ్వారు "నీకు తెలియదులే డిక్! బెన్‌గన్ బతికి వున్నా, చచ్చిపోయినా పసిపిల్లడుకూడా వాడికి భయపడడు. వట్టి అమాయకుడు, చాదస్తుడు "

కాని డిక్ కింకా నమ్మకం కలగలేదు. బైబిల్ గట్టిగా గుండె కానించుకుని తూలుతూ నడుస్తున్నాడు ఎండదెబ్బ, అలసట, భయం, డాక్టర్ లివ్‌సే చెప్పిన మలేరియా రోగం ఇవన్నీ కలిసి అతన్ని మరింత కుంగదీశాయి.

సిల్వర్ తాడుపుచ్చుకుని ముందు నడుస్తున్నాడు మా వెనక కళాసీలు ఇందాకటి ఉత్సాహంతో ఎగురుతూ, దూకుతూ నడుస్తున్నారు. ఇప్పుడు వాలు దిగుతున్నాము. కొంత దూరంలో మూడు పెద్ద దేవదారు వృక్షాలున్నాయి ఈ మూడూ ఆచుట్టు పక్కల వృక్షాల కంటె ఎత్తుగావున్నాయి ఈ మూడు చెట్లలోను ఏది పెద్దదైతే దానికిందనే గుప్తధనం కోసం వెదకాలి. మూడు వృక్షాలను చూడగానే కళాసీల ఆనందం వర్ణించ తరంకాదు. సిల్వర్ కూడా చెట్లను సమీపిస్తున్న కొద్దీ తొందర పడుతున్నాడు. ఏడు లక్షల పౌనుల ధనం అంత సమీపంలో ఉంటనే సరికి అతడు డాక్టరుగారికి, నాకు ఇదివరకు చేసిన వాగ్దానాలు, జమీందారు గారి పక్షాన చేరాలనే ఉద్దేశ్యమూ అన్నీ మర్చిపోయాడు. నన్ను శత్రువుగా చూడసాగాడు. నాకేసి విషపు చూపులు చూశాడు

కళాసీలు సిల్వర్‌ను దాటి ముందుకు పరుగెత్తుకు పోయారు. సిల్వర్ వాళ్ళతోపాటు పరిగెత్తలేక కుంటుతూ గెంతుతూ నడుస్తున్నాడు.

ముందుకు పరుగెత్తుకు పోయిన కళాసీలు ఒక్కొక్క చెట్టుదగ్గిరా పరీక్షించి ఆఖరి చెట్టుదగ్గిర ఆగారు ఒక్కసారిగా అంతా వెర్రికేక పెట్టారు.

"ఎవరో తవ్వేశారోయ్!" సిల్వర్ నిర్ఘాంతపోయాడు. క్షణంసేపు నిలబడి పరిస్థితిఅంతా ఆకళించుకున్నాడు "డాక్టర్ చెప్పినమాటల అర్థం ఇదన్నమాట," అని నాతో మెల్లిగా అన్నాడు. మేము కళాసీలను సమీపించేసరికి కనిపించిన దృశ్యం ఇది: చెట్టుకింద పెద్దగొయ్యి వున్నది గొయ్యి చాల కాలం కిందట తవ్వబడి నట్లున్నది. ఎందుకంటే గోతుల్లో కూడా పచ్చిక మొలిచింది. విరిగిన ఒకపారకూడా అక్కడ కనిపించింది. పారమీద "వాల్రస్" అనే అక్షరాలు కనిపించాయి. ఇదంతా చూసి కళాసీలకు మొహాన కత్తివాటుకైనా నెత్తురు లేకుండా పోయింది.

ఏడులక్షల పౌనులూ ఎగిరి పోయాయ్!

(ఇంకావుంది)

# న్యాయమంటే...?

**శ్రీ పినపాక నరసింహమూర్తి**

అది భోజరాజు ధారా నగ రాన్ని పరిపాలించే కాలం. భోజరాజు, తనవాడుక ప్రకారం ఒకనాటి రాత్రి మారువేషంతో ఒక బ్రాహ్మణ పంచ జేరి ఆయింటి యజమానితో సంభాషణ కుపక్ర మించాడు.

మాటల సందర్భంలో ఆయింటి యజమానికి మారు వేషంతో వున్న భోజరాజుకు "న్యాయము" మీద దానిని అమలుజరిపే పద్ధతిమీద తర్క-వితర్కాలు జరిగాయి "న్యాయమంటే" చెప్పబోతున్నాడు బ్రాహ్మడు, "ఒక నేరంలో న్యాయాధికారి సరియైన న్యాయం కలుగ జేయాలంటే ఆ నేరంలోని నిజా నిజాలు తనే స్వయంగా పరిశోధించి ఆ నేరస్థునికి తగిన శిక్ష విధించాలి. నేరస్థుడెవడైనా సరే" అని.

ఆ మరునాడు భోజరాజు ఆ బ్రాహ్మణుని సభకు పిలిపించి "ఏమయ్యా! రాత్రి, న్యాయమంటే ఎల్లా గుండాలో నాకు బోధించావు గదా! మరి యిప్పుడు వాటిని క్రియారూపకంగా చేసి చూపెట్టు నీకు ఓవారం రోజులపాటు ప్రధాన న్యాయాధికారిపదవి యిస్తున్నాను" అని అన్నాడు దానికి బ్రాహ్మణుడు సరేనన్నాడు కొంత భయంతోనే

ఆనాటి రాత్రి భోజరాజు ఉంపుడుగత్తె యింటిముందు జరిగిన విషయం ఎవరో ఒక వ్యక్తి ఆయింటి అరుగుపై పడుకొని వున్నాడు అదేసమయంలో కావలి వాడక్కడకు వచ్చి "ఎవరు నీవు" అని అడిగా డాతడిని మారు పలికేలోగా కావలివాడి తల ఎగిరి అవతల పడింది భటుని తల ఎగిరి అవతల పడడం, ఆ యింటి కిటికీ తలుపులొకసారి ఛటాల్న తెరచుకొని మళ్లీ మూసుకోవడం రెండూ ఒకే క్షణంలో జరిగాయి. కాని ఆ వ్యక్తి రెండవదానిని గమనించ లేదు.

ఆమరునాడే హత్యసంగతి భోజ రాజుకు నివేదించబడ్డది భోజరాజు న్యాయాధి కారియగు బ్రాహ్మడిని పిలిపించి "మూడు రోజులు గడు విస్తున్నా నీకు నేరస్థు డెవరో పట్టుకో! లేకపోతే నీ శిరస్సు ఎగిరి పోతుంది" అని హుకుం జారీ చేశాడు.

మొదటిరోజు గడిచింది నేరస్థు డెవరో అంతు తెలియలేదు రెండవ రోజునా అంతే మూడవ రోజున రాజు మళ్ళీ బ్రాహ్మడిని హెచ్చ రించాడు అయినా బ్రాహ్మడు నిబ్బరంగానే వున్నాడు

మూడవనాటి రాత్రి సరిగా పన్నెండు గంటలు హాజారమున కొడుతూన్న సమయంలో ఒకవ్యక్తి భోజరాజు ఉంపుడుగత్తె యింటి ముందు తారట్లాడుతున్నాడు. అపుడా యింటి కిటికీ తలుపు తెరచు కొంది ఆ వ్యక్తిని లోనికి రమ్మని ఒకహస్తం సంజ్ఞ చేసింది వెంటనే ఆ వ్యక్తిలోనికి వెళ్లాడు మళ్లీ రెండు గంటలకు బయటకువచ్చి అంధ కారంలోక విసవిస నడిచిపోయాడు

ఆమరునాడు అనగా హత్య జరి గిన నాలుగవ నాడు సభ అంతా ప్రేక్షకులతో కిటకిట లాడి

పోతూంది నేరస్థుడెవరో చూదామని భోజరాజుతో సహా ప్రజలందరూ కుతూహలంతో ఎదురు చూస్తున్నారు న్యాయాధికారి సభకు రాగానే "ఏమయ్యా! ఎక్కడ నేరస్థుడు?" అని అడిగాడు భోజరాజు "చిత్తం! తమరు కొంచెం ఇవతలకు దయచేస్తే నేరస్థుడెవరో చూస్తారు మీరే స్వయంగా!" అన్నాడు అతడు

భోజరాజు విస్మయంతో ముందు కడుగు వేశాడో లేదో న్యాయాధికారి సంజ్ఞనుచూసి యిద్దరు భటులు ముందుకువచ్చి భోజరాజుచేతికి బంగారు సంకెళ్లను తగిలించారు. ప్రజలందరూ కొయ్యబొమ్మలయ్యారు అయినా భోజరాజు ముఖం చూసి న్యాయాధికారి నేమీ చేయలేక పోయారు ముందు న్యాయాధికారి, అతని వెనుక బందీకృతుడైన భోజరాజు, ఆపిమ్మట ప్రజలూ అందరూ నెమ్మదిగా న్యాయస్థానానికి నడచి వెళ్లారు

భోజరాజు అపరాధిస్థానంలో నిలబెట్ట బడ్డాడు న్యాయాధికారి తనపీఠం అధిష్ఠించాడు ప్రజలందరూ అలాగే నిలబడి పోయారు. "హత్యానేరం నీపైన మోపబడింది! దీనికేమి బదులు చెప్పకుంటావ్!" అని అడిగాడు న్యాయాధికారి అపరాధిని. "ఒప్పుకుంటున్నాను! అది పొరపాటుగా జరిగింది! నిజంగా నేను చేయాలనుకోలేదు" అని ప్రత్యుత్తర మిచ్చాడు అపరాధి భోజరాజు.

"పొరపాటుగా జరిగినా యిచ్ఛాపూర్వకంగా జరిగినా హత్య హత్యే అవుతుంది దీనికి శిక్ష ఉరి! . " అని కొంచెం ఆగాడు బ్రాహ్మడు భోజరాజుతో సహా ప్రేక్షకులందరూ తెల్లమొగాలేశారు. ఇంకా చెప్పకు పోతున్నాడు బ్రాహ్మడుతన తీర్పును, "అందుచే భోజరాజు గావించిన యీ హత్యకు గూడా అదే శిక్ష. క్షత్రియుల కవమానము గావించుటే శిరచ్ఛేదనము కన్న నెక్కుడని ధర్మశాస్త్రాలు చెబుతూన్నాయి కనుక భోజరాజుకు బదులు, అతడి పసిండివిగ్రహం రేపు కోటగుమ్మంవద్ద ఉరితీయబడుతుంది'" తీర్పు ముగిసింది

ప్రజలందరూ ఒక్కసారిగా న్యాయాధికారి నుద్దేశించి జయ జయ ధ్వానాలుచేశారు భోజరాజు న్యాయాధికారియగు బ్రాహ్మడిని గాఢంగా కౌగలించుకొని "న్యాయమంటే ఇల్లా వుండాలి" అని అన్నాడు అంతేగాక ఆ బ్రాహ్మడినే యిక ముందుగూడా న్యాయాధికారి పదవిని నిర్వహించమని కోరాడు. అప్పటినుంచీ, భోజ రాజురాజ్యంలో న్యాయం, ధర్మం నాలుగు పాదాలమీద నడవడం మొదలెట్టి ★

# అపశ్రుతులు

(౧౮-వ పేజీ తరువాయి)

వాళ్ళని ఎలా బాధిస్తవో రాస్తే-యిలాంటి ప్రజలతో కూడిన సమాజంమీద విమర్శ వస్తుంది"

"అయితే శేఖరం యిలా మారినవాడే అంటావా ?"

"హాఁ" అన్నాడు బుచ్చి తడుముకోకండా

"అతనిలో మార్పు వస్తుందని నీకు నమ్మకం వుందా ?"

"తప్పకండా వస్తుంది వాడు మొదట్లో నిజంగా ఎన్నో ఉన్నతభావాలు కలవాడే కాని, వెనకతగిలే పోటీలు వాడి మతిని చెడగొట్టాయి"

"దానికి లొంగిపోవడం దుర్బలత్వం కాదంటావా ?"

"అహాఁ, నిజంగా దుర్బలత్వమే అంటాను కాని జానకీ, నీ చుట్టూ పెద్దపెట్టున నిప్పు అంటుకొంటె ఏంచేస్తావ్ ? నువ్వు మనిషివనే మరచి, అందునించి తప్పించుకోడానికి, సిగ్గుగూడ విడచి గొంతుకపోయేట్టు అరుస్తావు అప్పుడు నువ్వనే సాహసాలు, ధైర్యాలు ఎక్కడుంటై ? ఆ 'స్థితి' అలాంటిది అవునా ?"

జానకి సమాధానం చెప్పలేదు శేఖరాన్ని అంతగా మార్చేది ఆ వెనకనున్న 'రోదా'? అప్పుడే జ్ఞాపకంవచ్చింది శేఖరంగూడ కథలు రాస్తాడని ఈ టాపిక్‌ని మారుస్తూ తమాషాగా అడిగింది

"నువ్వు రాసే కథని చదివి, దానికి వ్యతిరేకంగా శేఖరం మరోకథ రాస్తే ?"

బుచ్చి చిన్నగా నవ్వాడు

"కాలుష్యాన్ని రాయడానికి కలం ఒప్పుకోదు జానకీ నగ్నసత్యం మెదడుని ప్రేరేపిస్తేగాని ఏ అవయవం రచనకి సాయపడవు"

"ఒకవేళ రాస్తే ?"

"అసలు వ్రాయడు వాడికింకా ఆత్మవిమర్శనాజ్ఞానం కలగలేదు"

బుచ్చిబాబు గాఢమైన ఈ నమ్మకమేమిటో జానకికి అర్థంకాలేదు ఇప్పటికీ శేఖరంమీద బుచ్చికి యింత దృఢమైన నమ్మకం ఎందుకుందో—మరి తనెందుకాయన్ని అసహ్యించుకొంటుందో, తనకే అర్థంకాలేదు ఆ సమయంలో తను శేఖరం గురించి బుచ్చితో అన్న పరుషవాక్యాలు జ్ఞాపకానికొచ్చాయి

శేఖరం వ్యక్తిగతంగా మంచివాడే కాని ఆయనలో సాహసంలేదు ప్రతీ చిన్నవిషయానికి కోపిష్ఠి అయిపోతాడు దాంతో ఎక్కడ 'వీక్ పాయింట్' వుంటుందో అక్కడ తన అక్కసుని తీర్చుకొంటాడు పశువులా తను మనిషినని మరచి ప్రవర్తిస్తాడు

ఈ మాటలు ఆమెని భయపెటాయి అప్పుడేమనస్సు పిరికిమంత్రం వేసి, వాక్శక్తి ఉడిగిపోయింది బుచ్చికి ముఖం చూపించలేక బయటకు వెళ్ళిపోయింది

మెల్లమెల్లగా రోజులు గడచిపోతున్నాయి వారంరోజులు తిరిగేసరికి బుచ్చి వ్రాసిన కథ పూర్తయిపోయింది తిరిగి చదువుకొన్నాడు తను రాసిందేగాని, ఆ భాష, ఆ శైలి, ఆ వాక్యాలు, పాత్రల సహజత్వం ఆశ్చర్యపరచేవి మరోదగ్గర ఏదో పెద్దగా లోపించి, రచన చప్పబడిపోయినట్టనిపించేది సమాజాన్ని ఎలా సంస్కరించాలో చివర ఒక స్త్రీ చేత ప్రయోగపూర్వకంగా కథని నడిపించాడు కాని తిరిగి చదివేసరికి అది చాలదేమో, ప్రజ, పాఠకులు దాన్ని అంతగా ఖాతర్ చెయ్యరేమో అని సంశయించాడు అయినా తన ఆత్మకి గొప్పదనే తృప్తితోనే కాగితాలని జతజేసి జానకిని పిలచాడు జానకి వచ్చింది

"కథ పూర్తయింది చదివి వినిపిస్తాను నీకు తోచినట్టు కథమీద అభిప్రాయాలని చెప్పు"

జానకి కుర్చీలో కూచొంది బుచ్చి చదవడం మొదలుపెట్టాడు మొదట మెల్లగా, రానురానూ కంఠస్వరం హెచ్చింది అందులో అమాయకురాలు, అజ్ఞాని అయిన గృహిణి, లక్ష్మిమాటలు చదువుతుంటె, సన్నగా జాలిగా బుచ్చికళ్ళనించి నీళ్లు తిరుగుతున్నాయి అదే గొంతుకతో చదువుకొన్న సావిత్రిమాటలు చదువుతూ ఆవేశంతో కంపించిపోతున్నాడు

మాటల్లోవున్న తీక్ష్ణతో, శైలిలో పాత్రల్లోవుండే సహజత్వమో—జానకికూడ కంపించిపోతోంది మొదటి ప్రకరణం పూర్తికాలేదు, బయటనించి బుచ్చినెవరో పిలచారు బుచ్చికి లేవడానికి బుద్ధిపుట్టలేదు, జానకిని వెళ్ళి చూడమన్నాడు జానకి వెళ్లి, తిరిగొచ్చి 'మొన్నొకసారి వచ్చినతనే' అంది

బుచ్చి ఛప్పున లేచి బయటకువెళ్లాడు తిరిగి జగన్నాధరావుతో లోపలికివచ్చాడు కాని జానకిలేదు లోపలికి వెళ్లిపోయి వుంటుందని, తనూ లోపలికివెళ్లి జానకిని తీసుకొచ్చాడు జగన్నాధాన్ని పరిచయం చేశాడు ప్రతి నమస్కారాలయాయి

"ఇంతవరకూ ఈ కథగురించే మా యిద్దరం మాటాడుకొంటున్నాం సరే, నువ్వు కూడ వచ్చావ్ పూర్తిగా అయినతరాత మీ అభిప్రాయాలు చెప్పండి" అన్నాడు బుచ్చి

జానకి కుర్చీ కాస్తదూరంగా లాక్కొని కూచొంది బుచ్చి, జగన్నాధం దగ్గరగా కూచొన్నారు బుచ్చి మళ్ళా చదవ మొదలుపెట్టాడు జగన్నాథ్ కుర్చీలో సావకాశంగా కూచొన్నాడుగాని, ఆ కథని వినేస్థితిలోకి చాలసేపటికిగాని రాలేకపోయాడు జానకి భూమినిచూస్తూ వుండిపోయింది

కథ పూర్తయింది—ఆఖరుకి చివరి వాక్యాన్ని చదివి బుచ్చి తృప్తితో, సంతోషంతో, ఆనందంతో తేలికై పోయాడు. జగన్నాథ్‌గూడ నిట్టూర్పువిడుస్తూ చిరునవ్వు నవ్వాడు

బుచ్చి కాయితాలని టేబిల్ మీద వుంచుతూ అన్నాడు "వెల్, ఇప్పుడు ముందుగా మనకొక్క వలసింది కథాగమనం, కథావిధానం, శైలి, భాష, సంభాషణ, పాత్రల మనస్తత్వాలు—అవికావు కథ ఏ దృష్టితో రాయబడిందో, దాన్ని కథ అందుకోగలిగిందా లేదా అని ?"

జగన్నాథ్ జానకికేసి చూశాడు జానకి ఒకసారి రెప్పలుఆడించి బుచ్చికేసి దృష్టి తిప్పుకొంది

"మొదట మీరు చెప్పండి" అన్నాడు జగన్నాథం జానకి నుద్దేశించి

జానకి ఠప్పున తలతిప్పి "నాకంత శక్తి లేదండి" అంది

"ఇందులో శక్తి, అశక్తుల ప్రసక్తిలేదు కథ 'క్లైమాక్స్'ని అందుకోగలిగిందా లేదా ?" అన్నాడు బుచ్చి

"ఇటు జగన్నాథ గాని, అటు జానకి గాని ఏం మాటాడలేదు మళ్ళా బుచ్చి ఏదో అనాలని నోరు తెరచేసరికి జగన్నాథ్ అడిగాడు "అసలు కథకుడు దేన్ని గురి చూశాడు ?"

"దాన్ని పాఠకుడు నిర్ణయించుకోవాలి, కథకుడి పనికాదు "

బుచ్చిమాటకి జానకి అడ్డుపడింది "కథకుడు కథరాసేది ప్రజకోసం ప్రజలు అజ్ఞానులని నీకు తెలుసు అలాంటప్పుడు కథలోని అంతరార్థాన్ని వాళ్ళకేవదిలేస్తే, వాళ్లెలా గ్రహించగలరు ?"

"గ్రహించుకోవలసింది—అని శాసనటం లేదు నిర్ణయించుకోవలసింది అంటున్నాను" అన్నాడు బుచ్చి "అంటె ప్రజలని చిత్రిస్తూ, వాళ్ళకి తెలీని—వాళ్ళల్లో వున్న అజ్ఞానాన్ని పెలికితీసి, అవి తప్పంటూ బోధించి, చివరికి యిది దారి, దాని ఫలితాలు యివి అని చూపించాను ఇక నిర్ణయించుకోవలసింది ప్రజ"

"అయితే వాళ్ళనలా నడపడానికి ఓ నాయకుడంటూ కావాలా ?" అన్నాడు జగన్

"ఆఁ"

"అలాంటివాళ్లు ఎక్కడ దొరుకుతారు వీళ్ళకి ?"

"వాళ్ళకి దొరకడమేమిటి ? వాళ్లల్లోనే ఉత్సాహవంతులు, కార్యదీక్షాపరులు పూనుకోవాలి సహజంగా వాళ్లు ఎన్నో కష్టాలపాలౌతారు చివరికి ఎవరికోసం నడుం బిగిస్తారో వాళ్ళే, వీళ్లని బాధిస్తారు"

"నీ కథలో అలాంటి నాయకులెవరున్నారు ?" జానకి అడిగింది

"భారతి అనే శ్రీమంతురాలు లేదూ ఆమె—"

"నాయకుడు స్త్రీగా ఎందుకు తీసుకొన్నావ్ ?" అన్నాడు జగన్నాథ్

"అసలు 'బేస్' అంతా స్త్రీమీదే"

జగన్నాథ్ చిరునవ్వు నవ్వుతూ "అక్కడే కథ కొంత అసహజంగా కనిపించింది" అన్నాడు

"కాదు" అని జానకిని ఉద్దేశించి "అయితే, నీ అభిప్రాయం ?" అడిగాడు

జానకి తల అడ్డంగాతిప్పుతూ అంది "ఇందులో నా అభిప్రాయం ఎందుకులే నీ అభిప్రాయం చెప్పు"

"సరె అయితే ఇటు చూడు జగన్, కథ మగాడితో మొదలయింది అతని అడుగులకి మడుగులొత్తే ఆడది—భార్య అనుకో—కాని ఆమె లేకండా అతను క్షణం వుండలేడు, కాని మిగతా ఇల్లాళ్లు ఆమెకి విధించిన పరదా, మొగడుతప్ప పరాయిమగాళ్ళు కంటపడకూడదనే ఆంక్ష ఆమెని నైతికంగా ఖూనీ చేసేశాయి

"అలానే మరో చదువుకొన్న స్త్రీ వీళ్ళని ఎదిరించేసరికి ఎన్నో మాటివిరుపులకి గురికావలసివచ్చింది భర్త చదువుకొన్నవాడే కాని వాతావరణం అతనిలో కలిగించిన చిన్నచూపు, భార్యమీద ప్రసరిస్తుంది సామాన్యకుటుంబంలో పుట్టిపెరిగిన ఆ అబల వెలుతురులోకి పోలేక, ఈ మాటలకి భయపడి అందరికీ విరోధినైపోయానే అనే మనోవ్యాధితో మరణిస్తుంది

"ఇక్కడతో కథ ఆపుచేసినా ఏం చెడిపోదు అది కథకుడి చేతిలోపని కాని విమర్శన ఒక ఆపరేషన్‌లాంటిదని అనుకొంటే, ఆ ఆపరేషన్‌తర్వాత సమాజంలో కుళ్లునంతా తీసిపారేసి గాయాన్ని అలా గాలికి వదిలేస్తే, సెప్టిక్ అయి మనిషి చచ్చిపోడు ? అందుకేం చెయ్యాలి ? మందులు వేసి, కట్టుకట్టి గాయాన్ని మాన్పాలి. అంటె కథని విమర్శనతో ఆపుచేయకండా, ఒకదారిచూపిస్తూ ముగిస్తే కథ సార్థకమవుతుంది" అని క్షణం ఆగి—

"ఇప్పుడీ కథ సమాజంలో ఎందుకూ పనికిరాకండా పతనమైపోతున్న స్త్రీ గురించి, స్త్రీలోకంలో చైతన్యంగురించి అలాంటప్పుడు స్త్రీలని నడపడానికి మరో హారేం పనికొస్తారు ? అందుకు అగర్భ శ్రీమంతురాలైన భారతిని—స్వయంగా ఈ కష్టాలు, అవహేళనలమధ్య పెంచి, అనుభవింపజేసి—చివరికి ఎన్నివిధాలుగా పటాపంచలు చేయగలిగిందీ వ్రాసి ముగించాను" అన్నాడు

జగన్నాథం మాటాడలేదు ఈ కథలో తనకి ఎంతవరకూ భాగంవుందని జానకి ఆలోచించుకొంటోంది అయితే తన జీవితం సమాజానికి బలికావలసిందే ? ఈ తలంపుకలిగిన తక్షణం కళ్లనీళ్లు మెల్లగా తిరిగాయి అదృష్టవశాత్తు ఎవరూ గుర్తించలేదు

"ముగింపులో నువ్వు సూచించిన 'స్వర్గం' మన సమాజంలో ఎంతకాలానికి 'ఫ్లరిష్' అవుతుంది ?" అన్నాడు జగన్నాథం

"మనమందరం నడుములు బిగిస్తే"

"నువ్వానా ?"

"అవసరం వస్తే"

"అదేమిటి? 'మనమందరం' అనేదాన్లో నువ్వు చేరవా?"

"చేరుతాను కాని మనిషిజీవితానికి ఎన్నో కోణాలున్నవిరా ఒక్కొక్క కోణంనించి ఒక్కొక్క వ్యక్తి పురిపెట్టి సంస్కరిస్తే, మనిషి జీవితం హాయిగా సమపాళ్ళలో పోతుంది అవి ఆర్థిక, సాంఘిక, నైతిక కోణాలు కాని సాహిత్యమనేది వీటన్నిటిమీద అధికారంతీసుకొని డైరక్ట్ చేస్తుంది ఒకేవ్యక్తి అన్ని విధానాల్లోనూ పనిచేయలేడు నేను చివరికోవకి చెందుతాను గాబట్టి నాకు కాలినడకకంటె కలం ముఖ్యం"

వాదన పొడిగించడానికి యిష్టంలేక జగన్నాథ్ నిశ్శబ్దమయ్యాడు బుచ్చిబాబు జానకికేసి చూశాడు ఈసారి ఆమె ముఖం ఆనవాలుపట్టడానికే వీలులేకండా వివర్ణమై పోయింది జగన్నాథ్ ఆమెకేసిచూసి నవ్వుతూ అడిగాడు

"మీఅన్నయ్యతో మీరు ఏకీభవిస్తారా?"

జానకి అవుననలేదు, కాదనలేదు కాసేపు మరివుంటే కళ్ళనీళ్ళు కిందపడతవని తలతిప్పి "కాని టీ తెస్తాన"నే నెపంమీద లోపలికి వెళ్ళిపోయింది

బుచ్చిబాబు వెళ్ళిపోతున్న జానకికేసే చూస్తూ వుండిపోయాడు చాలసేపటివరకు నోటమాట పెగల్లేదు సరిగదా జగన్నాథ్ వేసిన రెండుప్రశ్నలకి సమాధానం యివ్వలేదు చివరికి ఎందుకన్నాడో ఒక నిట్టూర్పు విడుస్తూ అన్నాడు

"ఈ కథ నా అనుభవంరా, జగన్"

"అవునందుకే అంత బాగుంది"

మళ్ళా కాసేపటివరకు బుచ్చి మాటాడలేదు గడియారం ఐదుకొట్టింది బుచ్చి తలతిప్పి మెల్లగా అడిగాడు "జగన్, వ్యక్తిమీద వాతావరణానికి ప్రభావముందంటావా?"

"చాలవుంది"

"అంటె?"

"ఒక యినపముక్క అగ్గిలో పెడితే వేడెక్కుతుంది మరీ వేడిచేస్తే అది కరిగి పోతుంది దాన్నే మామూలుస్థితిలో వుంచితే? అంతే మనిషిమీద పరిస్థితుల ప్రభావంగూడా"

"మానవనైజం మారడానికి, ఆర్థికస్థితికీ సంబంధం లేదా?"

"వుంది మనదేశం యింత మాంద్యంగా వుండడానికి ఆర్థికస్థితి వ్యత్యాసంగా వుండటంవల్లే"

"అయితే దాన్ని సరిజేస్తే మనిషి మారగలడంటావా?"

"అహాఁ ఆర్థిక అసమర్థత కొన్ని పరిస్థితుల్లోనే మనిషిని పిచ్చివాడుగా చేస్తుంది కాని అన్ని విషయాల్లో అది చెందదు"

"కారణం?"

"పేదవాడు పెళ్ళాన్ని చావగొట్టి, ఎప్పుడూ చిరమొర్లాడుతూవుంటె అది సైన్సుప్రకారం ఏదో ఆహారలోపం అని తేలుతుంది కాని గనవంతులుగూడ డబ్బుమీద మోజుతో మరీ నీచంగా ప్రవర్తిస్తారు అప్పుడు?"

బుచ్చి తటాపటాయించాడు "అయితే నేను ఏ కోవకి చెందుతాను?"

"ఏం ఎందుకు?"

"వాణ్ణి నేను బావమరదికంటె స్నేహితుడుగా ఎక్కువగా ప్రేమిస్తానుకాని వాడు నన్ను అర్థంచేసుకోలేక నీచంగా ప్రవర్తిస్తున్నాడు"

"అంటె?"

ఈ విషయం పూర్తిగా అతనికి చెబితేగాని అర్థంకానట్టుంది చెప్పడానికి సంకోచించాడు కాని ఆత్మ గోలపెడుతోంది లోపల బాధతగ్గే వుపాయం అదొక్కటే మెల్లగా జానకి వివాహందగ్గరనించి, అత్తవారింట్లో ఆమె కష్టాలు, శేఖరం ప్రవర్తన, చివరికి జరిగినపర్యవసానం, తన వెళితే చెంపపెట్టుతో తోసెయ్యడం అన్నీ చెప్పాడు

జగన్నాథం ఆశ్చర్యపోయాడు "నిజంగా శేఖరం యిలా ప్రవర్తించాడా?"

"అవును జగన్ వాడిని పరిస్థితులే మార్చాయో, వాడు పెరిగిన వాతావరణమే వాణ్ణలాచేసిందో తెలీటంలేదు"

ఇంకా జగన్నాథ్ ఆశ్చర్యంతగ్గలేదు ఈ ఆశ్చర్యం చివరికి జానకిమీద జాలిగా మారింది అప్పుడు తన మనస్సుని వెతుక్కున్నాడు జానకిని వూహించడానికి

ఇంతలో జానకి రెండుకప్పులతో టీ తీసుకొచ్చి టేబిల్ మీద వుంచింది బుచ్చి తలవంచుకొనే ఒక కప్పు అందుకొన్నాడు కాని జగన్నాథానికి ఆ పానీయంమీద ధ్యాసేలేదు క్షణంపాటు ఆ చేలకేసి చూస్తూ వుండిపోయాడు సరిగా ఆ సమయానికే ఆమెగూడ తలెత్తి జగన్నాథాన్ని చూసింది వెంటనే దృష్టిని ఆ త్రోవనించి తప్పుకొంది

టీ పూర్తయినతర్వాత స్నేహితులిద్దరు బయటికి వెళ్ళిపోయారు జానకి కాళీ కప్పుల్ని లోపలపెట్ట నడవలోకి వచ్చేసరికి తల్లితో మాటాడుతూ సుందరమ్మ కనిపించింది చిరునవ్వుతో జానకివచ్చి వాళ్ళ దగ్గరకూచొంది సుందరమ్మ ఆగి, వీధికేసి ఒకచూపు విసిరి అడిగింది

"అతనెవరు జానకి?"

జానకి యథాలాపంగా సమాధానమిచ్చింది "బుచ్చి స్నేహితుడట, ఎం ఏ క్రితం ఏడాదే పాసై వీరేశలింగం హైస్కూల్లో మాష్టరుపనికి వచ్చారట"

సుందరమ్మ మందహాసంచేస్తూ "పాపం! మరో బ్రతుకుతెరువు కనిపించలేనట్టుంది పంతులపనిలో ప్రవేశించాడు అదృష్టవంతుడు" అంది ఆ అదృష్టవంతుడని నొక్కిచెప్పడంలో ఆమె తన భర్త అదృష్టాన్నిగూడ కలిపిచెప్పిందని జానకి వూహించకపోలేదు

కాని ఈ అనవసరప్రశ్నలు జానకికి మహాచిరాకుని కలిగించాయి ఆమె ఈ ప్రశ్నలేవో కావాలని అనుమానంగానే వేసిందనీ జానకి మనస్సు అసహ్యంతో వికలమైపోయింది మరోమాట ఆడలేదు గిరుక్కున లోపలికి వెళ్ళిపోయింది (ఇంకా వుంది)

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(13-వ పేజీ తరువాయి)

డే నన్నిక్కడికి రప్పించాడు నేనెందుకు వచ్చానో భగవంతునికి తెలుసు నా కర్తవ్యం నెరవేరింది ఇంక నాకు సెలవియ్యి"

అనతికాలంలోనే ప్రయాణీకులిద్దరూ మార్సేల్స్ రేవు చేరారు అప్పుడే ఒక ఓడ బయలుదేరుతోంది అక్కడొక చోటు చూపించి మారెల్ ఇలా అన్నాడు "ఇదే చోట ఇక్కడే నేనూ నాతండ్రీ నిలబడి ఫరావోనాక తిరిగి రావడం చూశాము నాతండ్రి కన్నీటితో ఆకాశంవంక చూసి భగవంతునికి మొక్కాడు ఆ దృశ్యం ఇప్పటికీ నాకు కంటికి కట్టినట్లుంటుంది"

"అవును నేనూ చూశాను అదుగో అక్కడ నిలబడి నేను మిమ్మల్ని పరికించాను" అన్నాడు మాంట్ క్రిస్టో

ఇద్దరి దృష్టీ అకస్మాత్తుగా ఓడలో ఒక వ్యక్తిపై పడింది "అరె! అక్కడ నిలబడింది ఆల్బర్ట్ కాదూ?" అన్నాడు మారెల్.

"అవును"

మాంట్ క్రిస్టో మరొకవంక చూస్తున్నాడు మర్సిదా కంట నీరద్దుకుంటూ నిలబడి కుమారునికి వీడ్కోలు ఇస్తోంది

"మారెల్! నువ్వీ నగరంలో చూడవలసిన దేదైనా ఉందా?" అన్నాడు మాంట్ క్రిస్టో

"ఉంది నాతండ్రి గోరీ దర్శించి రావాలి"

"సరే వెళ్లు నేను వచ్చేవరకూ నువ్విక్కడే ఉండు"

మాక్సిమిలియన్ కనుచూపుమేర దాటి పోయేవరకూ మాంట్ క్రిస్టో చూశాడు తరవాత చిరపరిచితమైన మార్గం వెంట పూర్వం తన తండ్రి నివసించిన ఇంటివైపు నడిచాడు ఇప్పుడా ఇంటి నంతనీ మాంట్ క్రిస్టో మర్సిదా కిచ్చాడు

మర్సిదా కుమారుని ఓడపై పంపి వచ్చి, ఇంటివద్ద వెనక తోటలో ఒక చెట్టుకింద శిలాసనంపై కూర్చుంది చేతులలో ముఖం దాచుకుని ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది మాంట్ క్రిస్టో మెల్లిగా ఆమెను సమీపించాడు అడుగుల సవ్వడి విని మర్సిదా తలెత్తి చూసింది డాంటీని చూడగానే ఆమెముఖం పాలిపోయింది నిశ్చేష్టురాలై అతనివంక తేరిపార చూడ నారంభించింది డాంటీ ఆమెను చూసి నిలబడి పోయాడు

క్షణం గడిచిన తరవాత డాంటీ ఇలా అన్నాడు "పోయిన సుఖాన్ని నీకు తిరిగి తెచ్చిపెట్టలేను మర్సిదా! కాని మిత్రుడను నయితే స్వీకరించగలవా?"

"నిజంగా నాస్థితి దుర్భరంగా ఉంది డాంటీ! నేనీ ప్రపంచంలో ఏకాకినైపోయాను ఉన్న కొడుకు నన్నువిడిచిపోయాడు"

"ఆల్బర్ట్ ఉదారహృదయుడు మర్సిదా! అతను చేసిన దానిలో దోషం లేదు నీదగ్గర ఉండిపోతే అతని జీవితం దుఃఖభాజనమైపోయేది అతని భవిష్య జీవనాన్ని అతన్నే నిర్మించుకోనీ వచ్చి నిన్ను సుఖపెట్టగలడు అతను సమర్థుడని నాకు తెలుసును"

"ఆల్బర్ట్ భాగ్యవంతుడై తిరిగి రావచ్చు కాని నాకందులో సుఖం ఉండదు నాజీవితంవిషపూరితమైపోయింది నాకింకమృత్యువు దగ్గరపడింది తొలిరోజుల్లోఅలౌకికానందం అనుభవించినజన్మభూమికి నన్ను తెచ్చిన మీమేలు ఎన్నటికీ మరువలేను డాంటీ!"

"మర్సిదా! నాచేతులారా నీ సౌఖ్యాన్ని నాశనంచేశాను నాపట్ల ద్వేషం వహించవలసింది పోయి, స్నేహం చూపుతున్నావు దీనివల్ల నావ్యథ మరింత అధికమౌతోంది"

"నీపట్ల ద్వేషమా డాంటీ? నా కుమారుని ప్రాణాలు కాపాడినవాడిపట్ల ద్వేషమా? చూడు నావంక చూడు నాకళ్ళలో చూడు ద్వేషం వీసమైనా కనపడుతున్నదా?"

మర్సిదా సూటిగా అతనివంక చూసింది డాంటీ ఆమె కన్నులలో తరిచి చూశాడు "నాకు నీపట్ల కోపంకూడా లేదు డాంటీ! నన్ను నేనే నిందించుకుంటున్నాను నన్ను నేనే ద్వేషించుకొంటున్నాను ఒకప్పుడు నాలో ప్రేమ ఉండేది. పరిశుద్ధాంతఃకరణఉండేది అందం ఉండేది కాని ఇప్పుడవేవీ?"

డాంటీ ఆమెదగ్గరకు వచ్చి చేతు లందుకోబోయాడు ఆమె వారించింది "వొద్దు డాంటీ నన్ను తాకవద్దు అందరినీ శిక్షించి అందరికంటె ఎక్కువ అపచారం చేసిన నన్ను రక్షించావు నన్ను అనునయించడానికి ఇంకా నాపట్ల దయచూపబోతున్నట్లున్నావు కాని వొద్దు నేనందుకు తగను కష్టాలతో నాతల పండిపోయింది నాముఖం ముడతలు పడిపోయింది నువ్వో! నువ్వింకా వయసులో ఉన్నావు నీ అందం రవంతైనా మాయలేదు ఎందువల్లనంటే నువ్వెన్నడూ భగవంతుని కరుణను శంకించలేదు నీ కష్టాలన్నిటిలోనూ భగవంతుడే నీకు తోడైఉన్నాడు"

"మర్సిదా! నీకెందుకు ఆత్మనింద? నీ ఉత్కృష్టప్రకృతి ఎన్నడూ కష్టాలముందు వసివాడలేదు నీవేదన చూడలేకుండా ఉన్నాను నేనేది చేసినా భగవంతుని ఆజ్ఞ పాలించాననే భావిస్తున్నాను ఇందుకు భగవంతుడే సాక్షి నీకోసం నా ప్రాణాలైనా అర్పించడానికి పదేళ్ళనుంచీ సిద్ధంగా ఉన్నాను అది భగవంతునికే తెలుసును ఒకటిమాత్రం సగర్వంగా చెప్పుకుంటాను మర్సిదా! భగవంతుడే నన్ను బ్రతకమన్నాడు నేను బ్రతికాను కావలసినవారందరూ నన్ను నాదురవస్థకు విడిచిపెట్టేశారు అంధకార కూపంలో పద్నాలుగేళ్ళు మ్రగ్గిపోయాను హఠాత్తుగా ఒకరోజున ఆ అంధకారంనుంచి బైటపడి అపారసంపదలకు యజమానినైనాను ఇదంతా గమనిస్తే భగవంతుడే నన్ను తన కర్తవ్య నిర్వహణకు బ్రతికించి నాకీ సంపదలనూ శక్తినీ ప్రసాదించాడని తట్టడంలేదా? ఆనాటినుంచీ నాసుఖాన్ని, క్షేమాన్ని లక్ష్యపెట్టకుండా కర్తవ్య నిర్వహణకే కృషిచేశాను నాశరీరాన్ని అనేక పరీక్షలకు లోనుచేశాను కరుణ చంపుకుని అతిభీకర దృశ్యాలను చిరునవ్వుతో చూడ్డం నేర్చుకున్నాను అన్ని ఆటంకాలను అధిగమించి నాలక్ష్యం సాధించాను నన్నువంచించిన వారిని శిక్షించాను"

"చాలు చాలు ఎడ్మండ్! నిన్ను గుర్తుపట్టగలిగినది నేను మాత్రమే నిన్నూ నీ లక్ష్యాలనూ నేను పూర్తిగా అర్థం చేసుకున్నాను"

"మర్సిదా! నే నింక వెళ్లిపోతున్నాను నన్ను కోరవలసిందేదీ లేదా?"

"ఒక్కటే ఉంది డాంటీ— నా కుమారుని సుఖం"

"అతన్ని రక్షించమని భగవంతుని ప్రార్థించు మర్సిదా! అతనికి సుఖం చేకూర్చిపెట్టడానికి నేను సర్వదా కృషి చేస్తాను కాని నీకోసం కోరుకునేదేదీ లేదా మర్సిదా?"

"నేను కోరుకోగలిగే దేదీ లేదు డాంటీ! నే నిప్పుడు రెండు గోరీల మధ్య తిరుగాడుతున్నాను నేను ప్రేమించిన ఆనాటి ఎడ్మండ్ డాంటీ గోరీ ఒకటి డాంటీ చేతిలో మరణించిన వ్యక్తి గోరీ మరొకటి నువ్వు విధించిన శిక్ష న్యాయమే నంటాను. కాని చనిపోయినవారికోసం ప్రార్థించడం నా కర్తవ్యం"

"ఇప్పుడు నువ్వేం చెయ్యదల్చుకున్నావు, నీ కింక ఆధారమేమిటి? కౌంట్ మార్సెర్ఫ్ ఆర్జించినదానిలో సగం నీకు రావలసింది కూడా దానం చెయ్యడం మంచిది కాదు మర్సిదా!"

"నే నది స్వీకరించలేను డాంటీ నా కొడుకు సంపాదించి నువ్వు పెళ్లినాడు ఇవ్వాలనుకున్న మూడు వేలూ ఉంది అది చాలు నాకు"

"ఆల్బర్ట్‌కి సమ్మతం కాని దేదీ నువ్వు చెయ్యవద్దు కాని అతను నా సహాయం అంగీకరిస్తే నువ్వు నిరాకరించవుకదా "

"భోగవిలాసాలతో నా కింక నిమిత్తం లేదు డాంటీ! ఆధారంకోసం సహాయం పంపితే కాదనను "

"మన మింక తిరిగి కలుసుకునే దెక్కడ?"

మర్సిదా ఆకసంవంక చూపింది "అక్కడ "

## 91

మాంట్ క్రిస్టో హృదయభారంతో వెనుతిరిగాడు ఎడ్వర్డ్ చనిపోయినది మొదలు అతనిలో పరివర్తన వచ్చింది ప్రతీకారం తీసుకున్న తరవాత వెనుతిరిగి చూసేసరికి అతనికి అంధకారం కనపడింది శంకా సందేహాలతన్ని పీడించ సాగినాయి అదికాక, మర్సిదాతో మాట్లాడిన తరవాత పూర్వ స్మృతు లనేకం అతన్ని ముప్పిరిగొన్నాయి ఆత్మనిందకు లోనై ఎక్కడో తనవల్ల లోపం జరిగి ఉంటుందని శంకించనారంభించాడు ఏదో అసంతృప్తి హృదయాన్ని పిండ నారంభించింది గతాన్ని తరచ నారంభించాడు భాగ్య సంపదలను విడనాడినప్పుడు కాని తృప్తి కలుగదేమో ననుకున్నాడు మెల్లిగా నడిచి రేవు చేరాడు అక్కడే అతన్ని సిపాయిలు బోటెక్కించి ఇఫ్‌కోటకు తీసుకువెళ్లారు ఒక బోటులో కోటకు బయలుదేరాడు తిరిగి అతని కానాటి దృశ్యాలు కళ్ళకు కట్టాయి దూరాన దీపం, చుట్టూ అంధకారం, తప్పించుకోడానికి యత్నం, సిపాయిలు అదిమి పట్టుకోడం అన్నీ జ్ఞప్తికి వచ్చి అతనికి శరీరంజలదరించింది ముఖాన దట్టంగా చెమట పట్టింది "మనం ఒడ్డు చేరామండి" అని బోటువాడు చెప్పే వరకూమాంట్ క్రిస్టో మేలుకోలేదు

ఇప్పుడా కోటలో ఖైదీల నుంచడం లేదు దర్శనాపేక్షతో వచ్చేవారికి కోటంతా చూపడానికి మార్గదర్శకుల్ని ప్రభుత్వం ఏర్పాటు చేసింది

మాంట్ క్రిస్టో కోటంతా తిరిగి చూశాడు పధ్నాలుగేళ్లు తాను గడిపిన కుపాన్ని చూశాడు అది అంధకారబంధురంగా ఎప్పటిమాదిరిగానే ఉంది గోడ తవ్వి సొరంగం చేసినచోట మూసిక పెట్టినట్లు కొత్త రాతిపలక బిగించబడి ఉంది

"ఈ గదికి సంబంధించిన కథ లేవైనా ఉన్నాయా?" అని పరిచారకుని అడిగాడు

"ఇక్కడ జైలర్‌గా ఉన్న ఆంటోయిన్ నాకొక కథ చెప్పాడండి" అన్నాడు పరిచారకుడు ఆంటోయిన్ పేరు వినేసరికి మాంట్ క్రిస్టో ఉలిక్కిపడ్డాడు వెనక్కు తిరిగి ద్వారంవంక చూశాడు అక్కడ జైలర్ ఆకారం లీలగా అతని కళ్ళకు గోచరించింది

"అది చెప్పమంటారా?"

"చెప్పు "

"ఈ గదిలో భయంకరుడైన ఖైదీ ఒక డుండేవాడుటండి ఈ గదికి కొద్ది దూరంలో మరొక గదిలో ఒక పాదరీ ఉండేవాడు ఆయన పాపం పిచ్చివాడు "

"ఇద్దరూ కలుసుకునేవారా?"

"కలుసుకోడానికి వీల్లేదు కాని అందరినీ మోసపుచ్చి ఒక సొరంగం ద్వారా రెండు గదుల మధ్య దారి చేసుకున్నారండి "

"సొరంగం ఎవరు తవ్వారు?"

"ఇంకెవరు? మొదటి ఖైదీయే అతను బలిష్ఠుడు పాదరీ ముసలివాడు, బలహీనుడు అదీకాక అతను పిచ్చివాడు ఇంతపని చెయ్యలేడు "

"అంధులు" అని గొణుక్కున్నాడు మాంట్ క్రిస్టో

కథ చెప్తున్నంతసేపూ మాంట్ క్రిస్టోకి సర్వం తిరిగి అనుభవిస్తున్నట్లయింది తిరిగి తన బాధలన్నీ జ్ఞప్తికి రాగానే మనస్సుని పీడిస్తున్న శంక అధికమయింది

తరవాత ఫెరయా నిర్బంధించబడినగదికి వెళ్లాడు గోడపై పడే సూర్యకిరణాన్ని బట్టి కాలనిర్ణయం చేసే రేఖాచిత్రం గోడపై కనపడింది మాంట్ క్రిస్టో ఫెరయాను తలుచుకొని కృతజ్ఞతా పూర్వకంగా శిరస్సు వంచుకున్నాడు జేబులోనుంచి ఒక నాణెంతీసి పరిచారకుని చేతిలో పెట్టాడు పరిచారకుడు సంతోషంతో అందుకుని చూశాడు వెంటనే "ఇదేమిటి? మీరు పొరబడినట్లున్నారు ఇది బంగారునాణెం" అన్నాడు

"లేదు పొరబడలేదు తీసుకో "

పరిచారకుడు ఆశ్చర్యపడ్డాడు "అయితే నేను మీ కొకటివ్వగలను "

"ఏమిటది?"

"నే చెప్పిన కథకు సంబంధించినదే "

"నిజంగానా? ఏమిటది?"

"ఇటు వినండి పదిహేనేళ్లు ఒక్క గదిలో గడిపిన ఖైదీ ఏదో ఒకటి చివరి రోజున విడిచిపెట్టి పోతాడు అనుకుని నేనొక రోజు ఈ గోడలు తట్టి చూశాను ఒక చోట చిన్న గూడు కనపడింది అక్కడ "

"ఏమున్నాయి? పగ్గమా? పరికరాలా?"

"మీకెలా తెలుసు?" అన్నాడు పరిచారకుడు తెల్లబోయి

"ఊహించానంతే "

"అవునండి అవే అవి కొందరికి అమ్మేశా ఇంకా నాదగ్గరొకటుంది "

"అదేదో తెచ్చిపెట్టు అది నేననుకున్నదే అయితే నీకుపారితోషిక మిస్తాను "పరిచారకుడు పరుగు పరుగున వెళ్లాడు మాంట్ క్రిస్టో పడక ఉండవలసినచోట మోకరిల్లాడు "నాకు స్వేచ్ఛను, జ్ఞానాన్ని సంపదలను ప్రసాదించారు ఈనేలలో, ఈగోడలలో నాలో మీ అంశ ఇంకా మిగిలిఉంటే, నావ్యధ తీర్చండి నాశంక నివారించండి," అని ప్రార్థించాడు

పరిచారకుడు పరుగుమీద వచ్చాడు "ఇదిగోనండి" అన్నాడు మాంట్ క్రిస్టో లేచి అందుకున్నాడు ఫెరయా గుడ్డపేలికలపై రచించిన గ్రంథమది మాంట్ క్రిస్టో దృష్టి వెంటనే ఒక వాక్యంపైన పడింది "రాక్షసుల కోరలు పీకి, క్రూరమృగాలను కాల రాయగలవు అని దేవుడన్నాడు "

"ఇదే సమాధానం" అనుకున్నాడు మాంట్ క్రిస్టో సంకోచం పోయి, భారం తీరినట్లయింది గుప్పెడు నాణేలు తీసి పరిచారకుని చేతిలో పెట్టాడు

"ఇదేమిటి? ఇదంతా నాకేనా!"

"అవును నువ్విప్పుడిచ్చినది అమూల్యమైనది "మాంట్ క్రిస్టో ఉత్సాహంతో బోటెక్కాడు ఈ మారతనికి హైడీ జ్ఞప్తికి వచ్చింది "

మారెల్‌ను శ్మశానవాటికలో కలుసుకున్నాడు "మారెల్! నీకిక్కడింకా ఉండాలనుందా?" అన్నాడుమాంట్ క్రిస్టో

"నాకు నిరయించుకోగల విచక్షణ పోయింది కౌంట్! కాని ఇక్కడుంటే కొంత ఉపశాంతి కలగవచ్చు"

"అయితే ఇక్కడే ఉండు కాని ఏ అఘాయిత్యానికీ ఒడబడనని మాటిస్తావా?"

"మాట ఇస్తున్నాను అక్టోబరు ౫వ తేదీ మాట మీరు మరిచిపోకండి"

"మనుష్యుల మాటపట్ల ఇంత అవిశ్వాసం తగదు మారెల్! అక్టోబరు ౫వ తేదీని మాంట్ క్రిస్టోద్వీపంలో నీకోసం ఎదురు చూస్తూ ఉంటాను "



# కథాదారిద్ర్యం

మన దక్షిణదేశంలో సినిమాపరిశ్రమ పుట్టి దాదాపు రెండు దశాబ్దాలయింది కనీసం రెండు తరాల టెక్నీషియనులూ, నటులూ ఇందులో పని చేశారు ఆనాటి కానాడు సినిమాశిల్పమూ, పరికరాలూ, నటనా, స్టూడియో సౌకర్యాలూ అభివృద్ధి చెందుతున్నాయి గాని ఎంత మాత్రమూ దిగనాసిల్లటం లేదు ఒకనాడు 80 వేలకు తయారైన చిత్రాలు ఈనాడు మూడు లక్షలలో తెములటం లేదు ఇదంతా ద్రవ్యోల్బణం అనటానికి లేదు, ఎందుకంటే యుద్ధపూర్వంనాటి ధరలతో పోలిస్తే ఈనాటి ధరలు అయిదింతలు మాత్రమే పెరిగింది వెనక 30 మొదలు 40 కాల్ షీట్స్‌తో పూర్తి అయిన చిత్రాలు ఈనాడు 80నుంచి 90 కాల్ షీట్సు తీసుకుంటున్నాయి దానికి తగ్గట్టు పూర్వం రోజుకు 20 షాట్స్ తీసిన చోట ఈనాడు 10 కూడా కావడం లేదు

దీన్ని బట్టి పూర్వంకంటె ఇప్పుడు చిత్రనిర్మాతలు సినిమా చిత్రాలను రెట్టింపు శ్రద్ధతో, రెట్టింపు ఖర్చుతో, రెట్టింపు సమర్థతతో తీస్తున్నారన్నది నిర్వివాదాంశం పూర్వం తారలుసహితం తడవకు ఒక చిత్రంలోనే బుక్ అయేవారు ఆ చిత్రం పూర్తి అయి, రిలీజు పుచ్చుకొంటే గాని ఇంకొక బుకింగు ఉండేది కాదు ఈనాడు ఉపపాత్రలు ధరించేవారు కూడా ఒకేసారి నాలుగైదు చిత్రాలలో బుక్ అయి ఉంటున్నారు ఏమంటే ఈనాడు చిత్రనిర్మాతలు చిల్లరపాత్రలకు కూడా ప్రసిద్ధులైన నటులనే బుక్ చేస్తున్నారు

ఇటువంటి పరిస్థితిలో కొన్ని సినిమా చిత్రాలు దెబ్బ తింటున్నాయంటే దానికి కారణం కేవలం కథాదారిద్ర్యమే యుద్ధానంతరం తయారై, విడుదలై, దెబ్బతిన్న చిత్రాలలో నటుల హంగు చాలక గాని, శిల్పం లోపంచి గాని దెబ్బతిన్న చిత్రం చాలా అరుదు దాదాపు అన్నీ కథ సరిగా లేక తిన్నవే కథ బాగా బాగుండి మిగిలిన హంగులు—అంటే, సమర్థులైన నటులూ, తగిన సెటింగులూ ఫొటోగ్రఫీ రికార్డింగు పాటలూ, సంగీతమూ, దర్శకత్వమూ వగైరాలు లేక దెబ్బతిన్న చిత్రం మచ్చుకు కూడా కనబడదు

ఇందులో వింత ఏమీ లేదు కారణం చిత్రనిర్మాత వ్యయంచేసే ఇన్ని లక్షల రూపాయలకూ, నటుల నటనా సామర్థ్యానికీ, సెట్టింగులకూ, సంగీతానికీ, ఫొటోగ్రఫీకీ, దర్శకత్వానికి పునాది కథ సినిమా కథలో సన్నివేశాల పటుత్వమూ, సరిఅయిన పాత్రపోషణ ఉన్న పక్షంలో ఒక మాదిరి నటులు కూడా దానికి ఆకారం ఇవ్వగలరు గాని పాత్రలో లేని వస నటనతో భర్తీ చేయడం ఎవరితరమూ కాదు అట్లా సాధ్యమవుతుం దనుకునేవారు పరమానందాయ



శోభనాచలవారి "సావాసం" సెట్టుమీద మీర్జాపురం రాజా

విషయాలు దేనికేది ఆధారమోవారికి తెలియదన్నమాట

చెడిపోయిన చిత్రాలను ఒక్కసారి స్మరించినట్టయితే వాటిలో రెండు రకాలు కనిపిస్తాయి కొన్నిటి కథలు వస్తుతః సినిమాకు పనికి రానివి వాటితో సినిమా చిత్రాలు తీయాలన్న సంకల్పమే నష్టదాయకమైనది అయితే ఇటువంటి కథలు గల చిత్రాలు చాలాకొద్ది హెచ్చు చిత్రాలలో మంచికథకు అవకాశం ఉండికూడా కథ ఖూనీ అయిపోయినట్టు మనకు కనిపిస్తుంది ఈ చిత్రాలు మంచి కథ లేక చెడిపోయినవికావు మంచి కథకుల సహాయం లేక చెడిపోయినవి! ఇటువంటి చిత్రాలు తయారయేటప్పుడు ఏపాటి కథాజ్ఞానం గలవాడు ఆ ఛాయల ఉండినా మంచి చిత్రం తయారయేదేమో ననిపిస్తుంది ఇంతకన్నా శోచనీయమైన పరిస్థితి ఉండబోదు ఈ మధ్య విడుదలయిన చిత్రాలలో "స్వప్నసుందరి" "చంద్రవంక "అగ్నిపరీక్ష", "మంత్రదండం" వగైరా చిత్రాలు, మంచి కథలుండికూడా కథనం సరిగాలేక దెబ్బతిన్న చిత్రాలు

దీనికంతకూ మూలకారణం ఒకటి కనిపిస్తుంది--కథకుడికి చిత్రనిర్మాణంలో ఉండదగినంత ప్రాముఖ్యం లేకపోవటం ఇరవై ఏళ్ళ చిత్రనిర్మాణానుభవం ఉన్నవారు కూడా సినిమాకథ ఎవరైనారాయవచ్చునన్న అపోహతో బాధపడుతున్నారు ముఖ్యంగా తమ స్క్రిప్టు తామేరాసుకోగల డైరెక్టర్లలో ఈ భ్రమ హెచ్చుగా ఉంటున్నది దీనికి ఆధారమేమి కనిపించదు స్క్రిప్టు రచన వేరే కళ అయినమాట నిజమే, చాలామంది కథకులకు ఆ విద్య తెలియని మాటా నిజమే అయినప్పటికీ ఎంతమంచి స్క్రిప్టు కూడా మొట్టమొదట కథఆకారం తీసుకోవాలి ఆ స్వరూపంలోనే పాత్రలకూ, సన్నివేశాలకూ ప్రాణం ఏర్పడాలి ఆ ప్రాణం స్క్రిప్టులోనూ, షూటింగులోనూ పారించుకు పోకుండా కనిపెట్టి ఉండగల కథకుడు చిత్రంవెంట చివరదాకా ఉండాలి

చాలా చిత్రాల కథలు మొదలో నిరుష్టంగా ఉంటున్నాయనీ, సెల్యులాయిడ్ మీదికి ఎక్కే విధానంలోనే వాటిని పురుగు ముట్టుకుంటున్నదనీ సినిమా లైనులో అనుభవంగల కథకులు చెబుతున్నారు ఇది వాస్తవం కావచ్చు సినిమా చిత్ర నిర్మాణంలో చాలా దురాచారాలు ప్రవేశించాయి వీటిని ప్రవేశపెట్టినవారు కథాజ్ఞానశూన్యులు వీరికి చిత్రనిర్మాణంలో చాలాకాలంగా అనుభవం ఉండటం చేత కొంత పలుకుబడి ఉండి తమ పాత ఎద్దులను అమలుజరప గలుగుతున్నారు వీరి బాల్యంలో గొప్పచిత్రాలకు కొన్ని పొరపాట్లుండేవి వాటికి చలామణీ ఇవ్వడం కోసమని వీరు కథనూ పాత్రలనూ నిశ్చింతగా ఖూనీ చెయ్యగలరు ఒక్క అపశబ్దంతో పాత్ర ధ్వంసమయిపోతుందనీ ఒక్క సంభాషణ దర్పంగా వినిపించటానికో, ప్రేక్షక



సర్వోదయావారి "మానవతి" లో ఒక సన్నివేశం



మాంధాతగారి మూడోభార్య మంజరి అడుగులకు మడుగులొత్తలేక ఆటమటించే అభాగ్యరసికుడు టాం టాం
వినోదావారి "శాంతి"లో సావిత్రి, పేకేటి శివరాం

లను పర్వింపచటానికో ఆలోచించి పాత్ర చేత దానికి తగని మాట మాట్లాడించి నట్లయితే అందువల్ల ఆ పాత్ర దెబ్బ తింటుందనీ పాత్రపోషణ అతి సున్నితమైన విషయమనీ గుర్తించినవారు సినిమా రంగంలో ఈనాడు కూడా అరుదుగానే ఉన్నారు

కొందరు చిత్రనిర్మాతలదృష్టిలో సినిమా కథ రాసేటందుకు అర్హత గలవాడు కవి! వారి దృష్టిలో, ఈనాడు కూడా, కథ కన్నా పాత్రపోషణకన్నా, సంభాషణల కన్నా పాటలు ప్రధానం "సంగీతం బాగుంటే చిత్రం దెబ్బ తినదు" అన్నది ఒక సిద్ధాంతం మంచి సంగీతానికి మాటు పాటలు అందుచేత పాటలు ముఖ్యం ఇవాళ సినిమాలకు కథలు రాసి సంపాదించే దానికన్నా పాటలు రాసి ఎక్కువ సంపాదించవచ్చు

మరికొందరు చిత్రనిర్మాతలు స్క్రిప్టు తయారుచేయటానికి ఒకరిని మించి నియోగించటం వృధా అనుకుంటారు ఆ ఒకరూ దీర్ఘానుభవంగలవాళ్లుగా ఉండేటట్టు చూసుకుంటారు కథ రాయడమూ, సంభాషణలు రాయటమూ పాటలు రాయటమూ స్క్రిప్టు (ట్రీట్మెంట్) రాయటమూ వేరు వేరు విద్యలనీ, వీటికి తగినవారిని వేరు వేరుగా నియోగించవచ్చుననీ వీరికి తట్టదు చిత్రానికంతటికీ పునాది అయిన స్క్రిప్టు తయారయేవరకూ సాధ్యమైనంత తక్కువ ఖర్చు చేసి, ఆ స్క్రిప్టులో లేని శక్తి చిత్రంలోకి తీసుకురావటానికి చిత్రనిర్మాతలు లక్షలకు లక్షలు తగలెయ్యటం చూస్తే భయంకరంగా కనపడుతుంది

మన సినిమారంగంలో కథకుల ప్రభావం ప్రతిఒక్కరిమీదా ప్రబలంగా ప్రసరించవలసి ఉన్నది ఇప్పుడు మన డైరెక్టర్లు గాని, నటులు గాని చాలావరకు మొరటు పనితోనే తృప్తిపడుతున్నారు వారి పనితనంలో నాజూకు రావాలంటే సాహిత్యానికుండే గౌరవం సినిమాకు కూడా దక్కాలంటే వారికి సహాయపడగలవాడు కథకుడు తప్ప మరొకడు లేడు స్క్రిప్టు రచనలో కథకుడికి సరిఅయిన స్థానం ఇవ్వటమే గాక చిత్రనిర్మాతృవర్గంలో కథకుణ్ణి ప్రాధాన్యతగల స్థానంలో ఉంచినట్టయితే ఇన్ని చిత్రాలు దెబ్బ తినవలసిన అవసరం లేదు ★



పిచ్చి-ప్రేమలో విషమఘట్టం "పెళ్లిచేసిచూడు"లో రామారావు, వరలక్ష్మి, బాలకృష్ణ



వాహినీవారి 'మల్లీశ్వరి'లో భానుమతి, కమలాదేవి

# సంక్రాంతికి ప్రత్యేక సినిమా సంచిక

రాగల సంక్రాంతినాటికి ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికను ప్రత్యేక సినిమా సంచికగా వెలువరించుతున్నామని తెలుపుటకు ఆనందిస్తున్నాము

ఈ సంచికలో 1951 లో వెలువడిన తెలుగు చిత్రాలను గురించిన వివరాలూ అందులో పాల్గొని అన్ని రంగాలలోనూ పనిచేసిన చిత్రనిర్మాతలకూ, డైరెక్టర్లకూ, నటులకూ, టెక్నిషియనులకూ సంబంధించిన వివరాలూ, ఫోటోలూ, వర్ణచిత్రాలూ విరివిగా ఉంటాయి

1951 లో స్థాపించిన కొత్త సినిమా సంస్థలను గురించీ, ప్రారంభించిన చిత్రాలను గురించీ వివరాలుంటాయి

సంపాదకుడు



అంజలి పిక్చర్సు "పరదేశి"లో క్రొత్తరకం పాత్ర ధరిస్తున్న రంగారావు

# ధర్మసత్రం

(23-వ పేజీ తరువాయి)

పోలీసు (కోపంగా, కర్రతో గద్దించి) వీయ్ చెప్పకూడదు కొంతాలా ?

గురు లేదు బాబూ లేదు తెంపలేసు కుంటాను (అలా చేశాడు)

పోలీసు కుక్కలాగా పడుకో

గురు (మొత్తకు జేరగిలబడి) చిత్తం గురూ—(నిద్రోతాడు)

పోలీసు (కునుకుతూనే — నీరసంగా పాడతాడు)

"షింతచెట్టూ షిగురునూడూ
షిన్నదానీ షొగరు నూడూ"

(పాడతూనే నిద్రోతాడు—గోడ నానుకుని)

(ఉరుములు; మెరుపులు, సన్నచినుకులు ప్రారంభమయి క్రమక్రమంగా ఎక్కువవుతూంటాయ్ కుక్కలూ, పక్షులూ గోలచేస్తాయ్ గబ్బిలాయ లెగురుతాయ్ గుడ్లగూబ కూస్తుంది)

(ఎడమవైపు చీకట్లోకి నిష్క్రమించిన స్త్రీ, పురుష మూర్తులు జంటగా వచ్చాయి వాళ్ళ ముఖాలు అతుక్కుని వున్నాయ్ ముద్దుల చప్పుడు)

పురుషఛాయ (వెంకట గొంతుతో) మునిద్దట్లో ఎవరిదగ్గరుంటే ఏముందీ ఆ మురుగు లిట్లా యివ్వు

స్త్రీఛాయ (పార్వతమ్మ గొంతు) ఇది గట్టిగరుకు

పురుష నా గడియారం అమ్మేద్దును గానీ టైం తెలియకపోతే బస్తీలో మహా బావు

స్త్రీ అయితే ! అది అమ్మకు వెంకులూ ఇవి తీసుకో (మెరిసే మురుగులు తీసియిస్తుంది)

పురుష (మురుగులు జేబులో వేసుకుని) దాన్ని మరిపించి ఆ నానుపట్టెడకూడా తీసి యిచ్చావా - పొద్దున్నే అమ్మి పైకం తెచ్చేస్తాను ఇక మనం మద్రాసులో మకాం పెట్టామనుకో - (చిటికె వేసి) అంతే !

స్త్రీ నీయిష్టమే నాయిష్టమన్నానుగా వెంకులూ ! సరే

పురు మద్రాసులో నీకు - నీ జన్మలో ఎరగని గమ్మత్తులు ఎన్నెన్నో విచిత్రాలు చూపిస్తా ననుకో

స్త్రీ (ఖులాసాగా నవ్వి) నీ మూలాన నా అన్ని ముచ్చట్లూ తీర్చుకుంటాను (ముద్దెట్టుకుంది) ఇక పడుకోనా నా. (మెల్లగా వెళ్లి తన ప్రక్కను చేరుతుంది)

పురుష (చాపమీద పడుకోబోతూ పోలీసును చూచాడు) ఎవరో పోలీసున్నాడే (జేబును గట్టిగా పట్టుకుని - గాఢనిద్ర నభినయిస్తున్నాడు)

స్త్రీ (పక్కను వంగిచూచి) ఎవరదీ ?

(పక్కమీద నీడలు కదిలాయ్ మెరుపు కాంతిలో రెండు శరీరాలుగా కనిపించాయ్)

స్త్రీ (మెరుపు కాంతిలో పార్వతమ్మగా కనిపించింది)

పార్వ అయ్యో ! నీ పురువుగాలా - నీ సిగ్గు చితకా ఎంతపనీ, ఎంతపనీ !! (కోడలిని కాలితో తన్నింది) ఏమేవ్ .. (మళ్ళీ తన్నింది)

జానకి అత్తయ్యో దొంగలు, గొంగలు (ప్రక్కనున్న మూటను పట్టుకుని వదలి) ముసుగు దొంగలు, ముసుగుదొంగలు

పోలీసు • (కళ్లు నులుపుకుంటూ లేచి, లాంతరు ఎత్తి) ఎక్కడ ?

[చాపమీది వెంకట్రావు లేచి దీపం పెద్దది చేశాడు మంచంమీది వినాయకరావూ, కునుకుతున్న గురుమూర్తీ, యితరులూ లేచారు బంగారయ్య తలుపు తీసి

[లాంతరుతో వచ్చాడు జంకుతూనే]

వినా ! ఎక్కడా ?

గురు ఎవరూ ?

బంగా ఎటు పోయారూ ?

వెంకట ఏంపోయింది పార్వతమ్మగారూ ?

జానకి (ప్రక్కనున్నది మూట అని తెలుసుకుంటుంది ఆ వెలుగులో తన వీపుమీద తనే "థూ థూ" అనుకుని) మూట జూచి ఎవరో అనుకున్నాను

పార్వ ! (ఆశ్చర్యంగా) నే చూచిందబద్ధమేనా ? దొంగలు లేరూ ?!

పోలీసు మరేదో పోయిందంటున్నారే

జానకి (అత్త నెగాదిగా చూచి) మీ మురుగులేవి అత్తయ్యా

పార్వ ! (రెండు ముఖాని క్కప్పుకుని) దొంగ లసటం లేదటే కోడలుపిల్లా (ఏడ్పు)

[మిగిలినవాళ్లుకూడా లేచారు బుచ్చిబాబు తప్ప]

వినా . ఆ నాలిముచ్చు వెధవ లేడే ?

వెంకట ! అవునవును వాడే దొంగయ్యుంటాడు

బంగా ! నే నపుడే అనుకున్నా వాడు దొంగని !

బైరాగి [కళ్లు నులుముకుని] ఎవరండీ దొంగా ?

బంగా వాడే—ఆ పిచ్చి వాగుడుగాడున్నాడే—వాడు-

బైరాగి బుచ్చి బాబా ? ఆయన దొంగ కాదండీ !

వెంకట కాకపోవడమేమిటి ? వాడే దొంగ—

జానకి వర్తి శాడీసు వెధవ—

బంగా పచ్చి పొగరుబోతు దొంగ—

వినా ! వాడు కమ్యూనిస్టేనని నే చెప్పలేదూ—

పోలీసు కమ్యూనిస్టే ? అయితే—వాడే దొంగ ఆః [సంతోషం] నేపట్టేస్తాను యీ దెబ్బతో పైసల్ —ప్రమోషన్ కాళ్ళమీద పడిందన్నమాటే !

వినా ముందు వెదకవయ్యా—

పోలీసు ఏడీ ? ఎక్కడుంటాడూ ?

[వాన ఎక్కువయి పోయింది]

బుచ్చిబాబు [చెట్టు కిందినుంచి లేచి తల గులుపుకుంటూ అరుగుమీదికి వెళుతూంటాడు]

అందరూ అడుగో—దొంగ—వాడే దొంగ !!

పోలీసు [లాఠీతో నెత్తి మీద కొట్టి, పడిపోతున్న బుచ్చి బాబు నోరు మూసి లాక్కుపోతాడు]

[అంతా గందర గోళంగా మాట్లాడుకుంటూండగా గాలికి దీపాలు ఆరిపోతాయ్]

బంగా తుఫాను వచ్చేట్టుంది లోపలన్నా పడుకోండి— [హడావుడిగా అందరూ లోనికి తలో వైపూ వెళతారు]

[వురుములు మెరుపులు, వాన ఎక్కువయ్యాయ్]

బైరాగి [అరుగుమీద నే కూర్చుని పాడుతున్నాడు]

== పద్యగీతి ==

ఈ విశాల, నిశీథి, కారు మేఘాల క్రింద,
కీచురాలకుతోడుగా, కునుకు వీడి,
కవలి, కృశియించి, కన్నీరుకార్చు అవనీ !
కన్న కొడుకులు, కూతుళ్ళు, కలుకుమీరి;
కామ, క్రోధాల కౌగిళ్ళ జేరి, నిన్ను,
కడుపు కోతకు, యిటు, బలిజేసినార ?—
దిగులు చెందక, సంతతిన్, మేలుకొలిపి
వెలుగు బాటలు చూపవా—కన్నతల్లి ! ? !!

[యవనిక] 

# వోటు కోసం

గుమ్మంలో కారు ఆగినట్లనిపించింది హారన్ మోతకూడ వినిపించింది నిర్జీవి అయిపోయాడు వెంకన్న పంతులు నోట మాటలేదు సావిత్రమ్మకు పిల్లలిద్దర్ని మాని చిత్తరువులు చూస్తున్నారు 'ఇంకేముంది కొంప మునిగింది మంత్రిగారే వచ్చాడు యాకంగా' అంటూ వణుక్కుంటూ గంగన్న యింట్లోకి గబగబ వచ్చాడు చేతిలో కర్ర అవతల పారేసి గుండె బాదుకుంటోంది ముసలమ్మ.

'పెత్తనం వాళ్ళదిరా, మనం వాళ్ళను కదిలించి గెలవగలమా, వూరుకోరా అబ్బాయి అంటూ చిలకకు చెప్పినట్టు చెప్పా విన్నావుట్రా! ఇప్పుడు చూడు ఎవరు ఆలోచిస్తారు వూరుకోండని చెపుతూనే వున్నానండి, నామాట వినలేదండి యిప్పుడేమో యిట్లా అయిందండి' అంటూ గంగన్న వంతపాట

'ఎంత బలము వాళ్లదవుతేమాత్రం మంత్రిగారిదాక పోతుందని అనుకోలేదే. నేను తర్వాత పశ్చాత్తాప పడ్డాను ఎందుకు పెట్టుకున్నానా పోట్లాట అని అప్పుడు అందరు బలేపని చేశావు అనేవాళ్లే ఇప్పుడు మనల్ని ఆదుకోవటానికి వక్కడూ రాడే' అంటూ వెంకన్న పంతులు వాపోవటం

'నాన్నా నాన్నా, మొన్న సాయంత్రము బళ్ళో వెంకట్రామయ్య లెక్కలే తప్పవుతే, తప్పయిందని యెగతాళి చేశా అంటూ గంగన్నకు అడ్డంరాకపోతే పెద్దబ్బాయి పెళ్లి జరిగేదే

'తెలియక చేసేవి కొన్ని తెలిసిచేసేవి కొన్ని ఎట్లాగవుతేం కొంపమీదికి తెచ్చిపెట్టారు తండ్రి కొడుకులు కలిసి ఇప్పుడే మనుకుంటే యేంలాభం' అంటూ సావిత్రమ్మ కోపాన్నంతా వెళ్ళబుచ్చుతోంది

'అమ్మగారు బ్లాకుమార్కెట్టు చేస్తున్న వాళ్లనుకూడ పట్టుకోవటానికి వచ్చారట అంటూ అప్పుడే కొంచెంగా తొంగిచూసి, మెల్లిగా చెవినవేశాడు, గంగన్న

'ఆ! ' అంటూ ముసలమ్మ నిర్ఘాంత పోయింది

'ఏమండీ అట్లా అన్నారు' అన్నాడు గంగన్న అమాయకంగా 'అయ్యో, బ్లాకు

## శ్రీ ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

ఏం సమాధానం చెపుతావో మంత్రినే తీసుకువచ్చారుట' అంటూ ముసలమ్మ గజగజ వణికింది

'నేనూ ఆమాటే అన్నానండి పోలీసు జవానదగ్గరనుంచి మంత్రులవరకు వాళ్ల దయింది ప్రభుత్వము మన న్యాయము వని, మా బాబాయి మంత్రి ఏమనుకున్నావో ఏం చేయిస్తానో అంటూ మీద కొచ్చాడే' అంటూ మొన్నటి సంఘటన యీ సందర్భంలోనే అతికించాడు, సుపుత్రుడు

'అయ్యో ఆ మంత్రిగారబ్బాయి జోలికి యెందుకు పోయావురా! వాడిలెక్క రైటవుతేయేం, తప్పవుతేయేం నువ్వు కూడ వున్నావుట్రా నాయనా యిందులో' అంటూ ముసలమ్మ యింకొంచెం జోరుగా గుండె బాదుకుంటోంది

'సావిత్రమ్మగారు అబ్బాయిని యెందుకండి కొట్టటం ఏదో తెలీక అన్నాడు' మార్కెట్టు అంటె నాకు తెలీదమ్మ మొన్ననే శంకరంగారి భార్య, 'మాయింటికి చుట్టాలు వచ్చారు బియ్యము బొత్తిగా లేవు' అంటూ నాదగ్గరకొస్తే వూరుకోలేక పావుబస్తాబియ్యము యిచ్చానమ్మ అది కొత్త బ్లాకుమార్కెట్టు అని చెప్పింది గామాలు దీనికేం పుట్టిందో యీ భాగ్యానికి మంత్రిగారితో చెప్పాలిగామాలు అయ్యో నన్ను జైల్లోవేస్తారుగామాలు,' అంటూ ముసలమ్మ వకటే కేకలు

'అయ్యో నేను పుట్టినతర్వాత యెరగను బ్లాకుమార్కెట్టంటె చేతిలో దమ్మిడీ లేదని, కుసుములు అరబస్తా మా అన్నయ్య

చేత అమ్మించాను ఇదిమంత్రిగారికియెట్లా తెలిసిందో' అంటూ సావిత్రమ్మ ఏడుపు

'అయ్యో శాంతా నీపెళ్లి ముద్దుముచ్చట్లు నేను చూద్దామనుకున్నానే యిట్లా అవుతుందని కలలోకూడ అనుకోలేదే' అంటూ ముసలమ్మ ధ్వని పెంచేటప్పటికి, ఏం చెయ్యాలో అర్థంకాక శాంత, గోపీలు ఏడుపురుమన్నారు

వెంకన్న పంతులుగారికి 'కింకర్తవ్యం' అనే సమస్యలో యీ రోదన అంతగా వినిపించటంలా

'గోపన్న గార్ని పట్టుకున్నారు మనింటికి వచ్చేటట్టున్నారు,' అంటూ తత్తరపడి పోతున్నాడు గంగన్న

'అయ్యో గోపన్న గార్ని పట్టుకున్నారు అదుగో వస్తున్నారు' అంటూ ముసలమ్మ, దిక్సూచియంత్రంలాగ గుమ్మం వైపుకు తిరిగింది

మంత్రిగారు, మరిద్దరితో సహా గృహప్రవేశ మయ్యేటప్పటికి, పంచప్రాణాల్లో నాలుగుప్రాణాలు యెగిరిపోయినాయి వెంకన్న పంతులికి

'వెంకన్న పంతులుగారు మీరేనా' అన్నాడు అందులో ఒకాయన

ఈ బహువచన సంబోధనంతో కొంచెం తెప్పరిల్లి, 'చిత్తము' అని యెట్లాగైతేం అన్నాడు వెంకన్న పంతులు

'మీరు నలుగురు అన్నదమ్ములుటగా,' అన్నాడు యింకొకాయన

'సమాధానం రాకుండానే, 'వీళ్ళది పెద్ద కుటుంబం మొదటినుంచి వీళ్లంతా కాంగ్రెసు అభిమానులే' అంటూ రెండో ఆయన సమాధానం చెప్పాడు అప్పటికీ వెంకన్న పంతులుకు ఆసాంతంఅంతు చిక్కలా

ఇంతలో మంత్రిగారు కల్పించుకొని, 'ఇదివరకు మాదిరిగానే యీసారికూడ మీ వోట్లన్నీ మా కాంగ్రెసుకే వెయ్యండి మీకు ఇదవరకంటె అనేక విధాల లాభాలు వుంటాయి ఈమధ్య కుక్కగొడుగులలాగ అనేకపార్టీలు బయలుదేరాయి అందువలన భ్రమపడతారేమో అని చెప్పుతున్నాగాని, లేకపోతే పాతికేళ్ళనుంచి ఖద్దరు కట్టుతున్న మీ కుటుంబం యింకే పార్టీకి మీవోట్లు యిస్తారని అనుకుంటాం?' అంటూ మూడు ముక్కల్లో ముక్తసరిగా మంత్రిగారు వుపన్యాసం ముగించేటప్పటికి, వెంకన్న పంతులు పొట్ట చెక్కలయ్యేటట్టు విరగపడ్డాడు

అత్త, కోడళ్లు వకళ్ళగుట్టు, వకళ్లకు తెలిసిందే అన్నట్టు, వకళ్ళను చూసి వకళ్లు మూతి విరిచారు

వెంకన్న పంతుల విరగపాటు మంత్రిగారికి అర్థం కానేకాలేదు ★

# దేశీయసమస్యలు; పార్టీలు

## (4-వ పేజీ తరువాయి)

మరింత ఆధారపడుతూ సహకారంకోసం వెతుకులాడ్డమే సరైన సహకారాన్ని ఇంతవరకూ ఏదేశంలోనూ ప్రజలూ తమ ప్రభుత్వంతో సాధించలేకపోయినారంటే కారణం ప్రపంచపరిస్థితుల పరిణామమే నని అర్థం చేసుకోవాలి కమ్యూనిస్టు ప్రభుత్వాలుకల దేశాలలో ప్రభుత్వాలు ప్రజలను పూర్తిగా వశంచేసుకుని, వ్యక్తిగత స్వాతంత్ర్యంతో నిమిత్తంలేకుండా దేశీయార్థిక పునర్నిర్మాణమే ప్రధానంగా పరిపాలన సాగించినందువల్ల, ప్రజ లెన్ని కష్టాలకో లోనైనప్పటికీ కొంతవరకూ ఆర్థికస్థితిని వృద్ధిపరచుకొన్నారు కాని స్వాతంత్ర్య వాతావరణంలో వ్యక్తి వికాసానికీ వ్యక్తిగత కృషికీ అనువైన రాజకీయ వ్యవస్థలో, బలాత్కారంతోనూ దౌర్జన్యంతోనూ అవసరం లేకుండా ప్రజలకోసం ప్రజల ప్రతినిధులవల్ల స్థాపించబడిన ప్రభుత్వానికి ప్రజల సహకారానికి అధికావకాశం ఉండడం నిర్వివాదాంశం ఇట్టి స్వేచ్ఛా వాతావరణంలో ప్రజలకూ ప్రభుత్వానికీ మధ్య సహకారం కుదిరినట్లయితే నిత్య జీవితంలో ప్రజలకు సంఘర్షణ కష్టాలు నివారింపబడి వ్యక్తిగత జీవనసదుపాయాల అభివృద్ధికీ జాతీయాభ్యుదయానికీ అధికావకాశాలుండగలవు ప్రభుత్వ కార్యకలాపాలు ప్రజల కృషికి తోడైనప్పుడు ప్రజల అసంతృప్తికి తావుండదు ఇట్టి సహకారాన్ని సాధించాలంటే ప్రభుత్వంపట్ల ప్రజలకు విశ్వాసం కలగాలంటే, రాజకీయ పక్షాలు ముందుగా అట్టి విశ్వాసాన్ని సంపాదించాలి నేటి ఎన్నికలలో ఏ పార్టీకి అట్టి బలం, ఆత్మవిశ్వాసం, నాయకవర్గం ఉన్నవో గమనించడం అత్యవసరం నాయకులు ప్రజలహృదయపూర్వక విశ్వాసానికీ, ప్రేమకూపాత్రులు కానట్లయితే ప్రజలకూ అట్టి నాయకుల ప్రభుత్వానికీ మధ్య సంఘర్షణ అనివార్యమౌతుంది నేటి మన దేశపరిపాలన వ్యవస్థలో సహకారలోపమే ప్రజల అసంతృప్తికి కారణమని గ్రహించినప్పుడు, దేశీయ సమస్యల పరిష్కారానికీ, దేశంలో సుస్థిరప్రభుత్వస్థాపనకూ ఏ పార్టీని బలపరచాలో నిర్ణయించడం ప్రజలకు సులువౌతుంది అయితే పార్టీలపై కూడా ఒక ముఖ్యబాధ్యత ఉంది ప్రజలపట్ల రాజకీయ నాయకులు ప్రభుత్వోద్యోగులు నిర్వర్తించవలసిన బాధ్యతలను గుర్తుకు తెచ్చి, పరిపాలన ప్రజలకోసం ప్రజల నిత్యకష్టాలను గ్రహించి తన్నివారణ కనుగుణ్యంగా నిర్వర్తించినప్పుడు సర్వజనులకూ శ్రేయోదాయకమైన రాజకీయ వ్యవస్థ రూపొందగలదు ఇన్నేళ్లుగా పాశ్చాత్యదేశాలలో ప్రయోగపూర్వకంగా ప్రజలతోపాటు వారి చైతన్యంతోపాటు పరివర్తన చెందుతూ వచ్చిన ప్రజాస్వామ్య రాజ్యాంగవిధానం మన దేశంలో మన పరిస్థితులకు అనుకూలంగా ఒక రూపాన్ని పొందినప్పుడే, అది స్థిరపడి ప్రజలందరికీ సుఖజీవన సదుపాయాలను సమకూర్చగలుగుతుంది అట్టి నూతన వ్యవస్థకు రూపప్రతిష్ఠ చెయ్యవలసిన కర్తవ్యం ఈనాడు రాజకీయపక్షాలపైన పడింది



Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, ,7 Thambu Chetty St, Mdara



బీహార్ పర్యటన సందర్భంలో పాట్నా చిత్ర ప్రదర్శనాలయాన్ని రిపబ్లిక్ అధ్యక్షులు
డా॥ రాజేంద్రప్రసాద్ పరిశీలించారు




ఢిల్లీలో స్త్రీలచే నిర్వహింపబడిన చిత్రప్రదర్శనాలయాన్ని సర్వ సైన్యాధిపతి కరియప్పగారు దర్శించారు